# మున్నుడి

ఈ నవల 1946 లో రచించాను. 1947 లోనే యిది ప్రచురింప బడే సూచనలు కనుపించినా కొన్ని కారణాలవల్ల అజ్ఞాత వాసంలోకి వెళ్ళి యిప్పటికిగాని వెలుగుచూచే అవకాశం కలగలేదు.

దీనిలోని కథ అల్లసాని పెద్దనగారి మనుచరిత్రలోని మొదటి మూడు ఆశ్వాసాలనూ ఆధారంగా చేసుకుని కల్పించబడ్డ వరూధినికీ మాయా ప్రవరుడైన గంధర్వునికీ మధ్య జరిగిన ప్రణయగాధ. ఈ కథలో పురాణప్రసిద్ధులైన శచీంద్రులను, రతి మన్మధులను చిత్రలేఖ మొదలైన అప్సరసలను వుపయోగించుకున్నా వారు నిర్వహించిన పాత్రలుమాత్రం కేవలం కల్పితములైనవి. మాయా ప్రవరుడైన గంధర్వుని పేరు మనుచరిత్రలో చెప్పబడలేదు. అతనికి నళినాక్షుడన్న పేరు నేనిచ్చిందే. ఇక శ్రీలేఖ ముసలిశిల్పి పాత్రలు నేను సృష్టించినవి. లక్ష్మి, చంద్రుడు తోబుట్టువులుగా గలిగి, రంభాది అప్సరోగణంతో పాలసముద్రంలో పుట్టిన వరూధినికి ప్రత్యేకంగా శ్రీలేఖ అన్న చెల్లెలు వున్నట్టు చెప్పడం అసమంజసంగా తోచవచ్చు. కాని మనుచరిత్రలో వరూధినికి ఇందీవరాక్షుడనే అన్న వున్నట్టు చూస్తాం. ఆమెకు వొక అన్నవుండగా లేనిది చెల్లెలిని సృష్టించడంలో తప్పేమీ లేదనిపించింది. సృష్టిచేశాను. ముసలిశిల్పి పెద్దనగారి పూర్వజన్మలలో వొకటని మీరే గ్రహించగలుగుతారు. పెద్దన వర్ణనలలో రాళ్ళనుమలిచి రూపులుదిద్దే శిల్పిపనితనం గోచరించిందినాకు. ఏజన్మలోనో అతడు శిల్పిగా పుట్టివుండాలనిపించింది. అందుకనే అటువంటి పాత్రను సృష్టించాను.

ఈ కథ రాయడానికి మూలకారణం మనుచరిత్ర చదవగానే నాకుకలిగిన వొక సందేహం. కేవలం వరూధిని వలచి తిరస్కరింపబడి

విరహతాపాన్ని అనుభవించడంతప్ప స్వారోచిష మనుసంభవంతో యేలాంటి సంబంధమూలేని ప్రవరాఖ్యుని కథను అంత విస్తరించవలసిన కారణమేమిటి? వరూధినిని మోహగించిన గంధర్వుడు, దివ్యజ్ఞాన సంపన్నుడూ, కామరూపుడు అయివుండికూడా, ప్రవరుడు వచ్చివెళ్ళిందాకా యెందుకు ఊరుకున్నాడు. వరూధినిని మోహింపచేసే రూపాన్ని తనంతట తానే పొందలేకపోయాడా? ప్రవరుడికీ, గంధర్వుడికీ కూడా స్వారోచి పుట్టుకతో యేదో నిమిత్తం వుండాలి? ఈ ప్రశ్నకు నాఅంతట నేను సమాధానం చెప్పుకోడానికి చేసిన ప్రయత్నమే ఈ కథాస్వరూపం.

ఈ కథలో కళనుగూర్చి కొంత ప్రస్తావనచేశాను. ఈ ప్రస్తావన ప్రాథమైందిగాని, సమగ్రమైందిగాని కాదు. భారతీయ కళనుగురించి వున్న గ్రంథాలవన్నీ బాగా పరిశీలించి చేయవలసినపనికి కేవలం కళమీద (పదమూడేళ్ళక్రితం) నాకున్న అభిప్రాయాలమీదా, వూహామీదా ఆధారపడ్డాను. కళవిషయంలో నేను చేసిన ప్రస్తావన యెట్లావున్నా వొక ముఖ్యమైన విషయంమాత్రం చెప్పాలి. ఇందులో Models పద్ధతిని ప్రవేశపెట్టాను. కళాకారులు Models ని వుపయోగించడం మన ప్రాచీన సాంప్రదాయమని తోచదు. మన ప్రాచీనకళ అంతా సాముద్రికలక్షణాల మీదా, వర్ణనలమీదా, వూహామీదా ఆధారపడివుండేది. ఏ కాలిగోరో తలవెంట్రుకో చూచి ఆయా వ్యక్తుల స్వరూపాలను చిత్రించిన ప్రజ్ఞావంతుల కథలనుకూడా వింటాంమనం. ఈ ప్రజ్ఞ మెచ్చుకోతగ్గదే అయినా మూలానికి యెంతన్యాయం చేకూర్చేదో చెప్పలేం. మోడల్సు పద్ధతే మనకు ఆనాడు వుండివుంటే మనదేశచరిత్ర యింకా సమగ్రంగా వుండేదని నా అభిప్రాయం. మన గాథలూ, కవిత్వమూ, కళా అంతా వూహాగానంగా వుండడంచేతనే మనచరిత్రకూడా చాలాభాగం వూహాగానంగానే వుంది. ప్రాచీనమైన వొక కథను చెబుతూ, ప్రాచీన సాంప్రదాయాలకు విరుద్ధమైన వొక పద్ధతిని ప్రవేశపెట్టాను. అది కథాగమనానికి చేసినపని. కేవలం కథక "సమయం" గానే సహృదయులు భావించాలని మనవి. అయినా ఈ కథలో కళ ప్రధాన విషయంకాదు. కథాగమనానికి అంగం మాత్రమే.

ఈ కథను స్క్రిప్టుదశలోనే 1947 లో శ్రీయుతులు చింతా దీక్షితులుగారూ, యెం. నరసింహారావు ( శేషాచలం & కో., మద్రాసు ) గారు, ఆచంట జానకీరాం, (A. I. R. Madras) నీలంరాజు వెంకట శేషయ్య ( ఆంధ్రప్రభ ) గారలు చదివి వారి అభిప్రాయాల నిచ్చినందుకు వారికి నా కృతజ్ఞత. ఇటీవలే శ్రీ పోతుకూచి సాంబశివరావుగారు చదివి తమ అభిప్రాయాన్ని యివ్వడమేగాక దీని ప్రచురణకుకూడా కారకు లైనారు. ఈ పుస్తక విషయంలోనేకాక నా వైకుంఠపాళి విషయంలో కూడా వారు చూపిన శ్రద్ధ నేను యెన్నటికీ మరువలేను.

ఈ నవలను ప్రచురించడానికి అంగీకరించిన శ్రీ గద్దె లింగయ్య గారికి కూడా నాకృతజ్ఞత.

ఇట్లు రచయిత

పి. వి. కృష్ణమూర్తి.

అంకితం

వరూధినికి – సానుభూతితో

నళినాక్షుడు చమత్కృతుడైనాడు యెందుకో! అతని హృదయంలో యేదో కదిలింది. అత నలాగే నిశ్చేష్టుడై చూస్తూవున్నాడు. అతను చూస్తూవున్న వాతాయనంలో నుంచి వొక చల్లని పిల్లగాడ్పు పద్మ సౌరభాన్ని తీసుకొచ్చి ఆ గదినంతా నింపింది. నళినాక్షుడు నేర్పరియైన వొక చిత్ర కారుడు. అతడు అతికౌశలంతో చిత్రించిన అనేక చిత్తరువు లతో ఆ గది అంతా యెంతో నాజూకుగా అలంకరింపబడి వుంది. అతని చిత్రకళా నైపుణ్యానికి మెచ్చి కుబేరు డతనికి బహుమతిగా నిచ్చిన భవనమది. దాని నిర్మాణ నైపుణ్యానికి విశ్వకర్మ చకితుడైనాడు.

ఆ భవనం చైత్రిరథమనే కుబేరుని వుద్యానవనంలో నిర్మింపబడి వుంది. నందనవనం తరువాత సుందరమైన వనం యేది అన్న ప్రశ్న వచ్చినప్పుడు చైత్రరథమన్న ప్రత్యు త్తరం వెంటనే వస్తుంది. కాని కొన్ని కొన్ని విషయాల్లో మనం చైత్రరథానికే ప్రాధాన్యం ఇవ్వవలసి వుంటుంది. కరి గించి పోసిన వెండి ముద్దలవలె మిలమిలలాడుతూ చైత్రిరథా నికి చుట్టూవున్న మంచు కొండలమీద సూర్యోదయ కాల మందును అదే రీతిగా సూర్యాస్తమయ కాలమందును రంగు రంగుల మబ్బులు వాలుతూంటే ఆ వనానికి వచ్చే శోభ నందనవనం యెన్ని జన్మలెత్తి తపస్సుచేస్తేమాత్రం వస్తుంది! అక్కడి మదించిన గండు తుమ్మెదల రొదలు వింటే చాలు, ఆ తోటలోని పుష్పసమృద్ధిని మనం సునాయాసంగా వూహించుకోవచ్చు. అక్కడి చిలుకల పలుకులు వింటే

చాలు, ఆ తోటలోని పళ్ళు యెంత మధురంగా వుంటాయో మనం గ్రహించవచ్చు. అక్కడి కోకిలల మధుర కూజితాలు వింటే చాలు, ఆ తోటకూ వసంతర్తువుకూ యెంత సన్నిహిత బాంధవ్యం వుందో మనం తెలుసుకోవచ్చు. అక్కడి నెమళ్ళ నృత్యం చూస్తే చాలు, అక్కడి సెలయేళ్ళు మేఘ ధ్వనులను యేవిధంగా ధిక్కరిస్తాయో వూహించవచ్చు.

చైత్రరథానికి సరిగ్గా మధ్యలోంచి మందాకిని ప్రవహిస్తూవుంటుంది. తన జీవనమంతా పాతాళంలోకి ఊడ్వబడుతూ వున్నా గంగకు యెలాంటి విచారమూ లేదు. పసితనపు చిలిపి చేష్టలు పూర్తిగా వీడని యువతిలా దారిలో యెదురయ్యే చిన్న చిన్న రాళ్ళమీదినుంచి గెంతుకుంటూ ఒడ్డున రాలిన మందార పారిజాతాది విరులను తరంగ హస్తాలతో యేరుకుంటూ, హంసధ్వని గీతికలతో ముందరికి సాగిపోతూ వుంటుంది. గంగకూ నళినాక్షుని భవనానికీ అట్టే దూరం వుండదు. మధ్యన వున్న ప్రదేశంలో మాలతీ, కేతకీ, చంపక, మందారాది పుష్ప వృక్షాలు విరబూచి చూడడానికి యెంతో ముచ్చట కలిగిస్తూవుంటవి. ఆనాడు నళినాక్షునికి యేమీతోచక తనగదిలోవున్న వాతాయనంలోంచి బయటికి చూస్తూ ప్రకృతి సౌందర్యంలో లీనమైనాడు. కాని అతని దృష్టిని వొక గండుతుమ్మెద ఆకర్షించింది. కలకలలాడుతూ విరబూచివున్న మాలతీలత మందమారుతపు తాకిడికి తొలిసారి ప్రియుని స్పర్శకు పులకరించి జలదరింపుతో

మెల్లిగా వొళ్ళు కదిలించే ముగుదలా కదలాడుతోంటే దాని మీద వాలి మకరందపానం చేయబోయిన ఆ తుమ్మెద "ఝుం" కారం చేస్తూ లేచి నలుదిక్కులా సుగంధాన్ని వెదజల్లుతూన్న కేతకీ పుష్పంమీద వాలబోయింది. కాని దాని ప్రయత్నం అతికష్టం మీదగాని ఫలించింది గాదు. ఆ పువ్వుమీద కూర్చుని తనివితీర మకరందాన్ని ఆస్వాదించడానికి కూడా దానికి వీలులేక పోయింది. చుట్టూవున్న ముండ్లతో దాని రెక్కలు చీలిపోయేంతపని అయింది. కొంచెం నేర్పుతో అది ఆ అపాయంలోంచి యెల్లాగో బయట పడగలిగింది. తనకోసం యెదురు చూస్తూవున్నదా అన్నట్టు వున్న మాలతి మీదనే మళ్ళీ వాలింది. ఇది చూచి నళినాక్షుడు చమత్కృతు డైనాడు. యెందుకో అతని హృదయంలో యేదో కదిలింది.

అదే సమయంలో వొక ఆడుతుమ్మెద సంపంగి చెట్టు మీదకు పరుగు తీస్తూంది ఆ పూవుకోసం. అది బాగా మత్తెక్కిన తుమ్మెద. సంపంగి తనకు విషప్రాయమనే సంగతి తెలుసుకునే స్థితిలో లే దది. కేవలం ఆ పుష్ప సౌందర్యాన్ని చూచే దానిపైకి యెగబడుతోంది. దగ్గరికి వెళ్ళి వొక్కసారి తలతిరిగి కిందపడింది. పడి కొంతసేపటికి గాని తేరుకోలేకపోయింది. మళ్ళీ పైకి లేచింది. సంపంగిమీది భ్రమతోనే సమీపంలోవున్న మరొక పూవుమీద వాలింది. నళినాక్షుడు అలాగే నిశ్చేష్టుడై చూస్తూవున్నాడు. ఇంతలో యెవరివో

నునుపైన వేళ్ళు నాజూకుగా ఆ పువ్వుని తుంపినవి. పాపం! ఆ తుమ్మెద ఆ పువ్వు కోసం అక్కడే తిరుగుతోంది.

ఆ కోసిన పువ్వుని నాజూకుగా తల్లో తురుముకుంటూ వయ్యారంగా ఏక పడుచు ముందరికి నడిచివస్తోంటే నళినాక్షుడు తనను తాను మరిచిపోయి చూస్తూవున్నాడు. ఆమె దాసాని పువ్వు రంగులో వున్న పావడ కట్టింది. పైన వల్లె వాటుగా వేసిన బంగారు వన్నె సన్నని పట్టుబట్టలోంచి ఆకు పచ్చని కంచుకం స్ఫుటంగా కనిపిస్తోంది. ఎవ రా పడుచు? ఆ నడకలో ఎక్కడి దా వయ్యారం?

## 2

"శ్రీ లేఖా!" అన్నాడు నళినాక్షుడు ఆమె ముఖం వైపు నిదానించి చూస్తూ.

శ్రీలేఖ కుడిచేత్తో పట్టుకున్న కనకకమలాన్ని విలాసంగా తిప్పుతూ, చక్కని నాట్యభంగిమలో ప్రతిమలా నిలబడివుంది. నళినాక్షుడు ఆ భంగిమను కూర్చికతో చిత్రిస్తూ వున్నాడు.

"శ్రీ లేఖా!" అన్నాడు మళ్ళీ. ప్రవాళ వర్ణాన్ని చిత్రగత శ్రీలేఖ అధరోష్ఠానికి మెల్లగా పట్టిస్తూ.

శ్రీ లేఖ యేమీ మాట్లాడలేదు. దీర్ఘంగా వొక నిశ్వాసం మాత్రం విడిచింది.

"ఏం, అలసిపోయావా ?"

"ఉఁ హుఁ"

"మరి ?"

"నేను వచ్చి చాలాసేపైంది"

"అయితే......"

"తొందరగా వెళ్ళాలి..."

"ఉండు వెడుదువుగాని. చిత్రం పూర్తికాగానే..."

"ఆయనకు కోపం వస్తుందేమో"

"ఎవరికీ – కాస్త ముఖాన్ని – కొంచెం – ఇటు ప్రక్కకు – చాలు"

"శచీ పతికి" అంది ముఖాన్ని నళినాక్షుడు వుంచ మన్న భంగిమలో వుంచుతూ శ్రీలేఖ.

"అతనెవరూ నిన్ను కోప్పడ్డానికి ?"

"అతను త్రిలోకాధిపతి"

"అయితే నీకేం ?"

"నేను వారి దాసిని"

"దాసీవి... దాసి... ఆ రెప్పలు కాస్త కిందికి దించు... అంతే – అంతే – హుఁ ! దాసి – స్వారాజ్యంలో దాసీత్వం !... నవ్వొస్తోంది."

శ్రీలేఖ మౌనంగా వుండిపోయింది. నళినాక్షుడు చిత్రాన్ని శీఘ్రంగానే ముగించాడు.

శ్రీలేఖ ఆ చిత్రాన్ని చూచి తనలో యింత సౌందర్యం యిమిడి వున్నదా అని ఆశ్చర్యపడింది.

"ఇప్పుడూ నీకు నిజమైన అమరత్వం — అచలత్వం" అన్నాడు నళినాక్షుడు చిత్రాన్ని శ్రీలేఖ దగ్గరకు తీసుకొచ్చి యెత్తైన పీటమీాద వుంచుతూ.

శ్రీలేఖ కిలకిలమని నవ్వింది. ఆ నవ్వుకు బంగారు గజ్జెలు మోగుతున్నాయన్న భ్రమతో రాజహంస వొకటి లోపలికొచ్చింది.

తా నన్న మాటలకు శ్రీలేఖ యెందుకు నవ్విందో నళినాక్షునికి అర్థం కాలేదు. "ఎందుకూ?" అన్నాడు. ఆమె కళ్ళలోకి గుచ్చి చూస్తూ. ఆ చూపు వొక వాయువులాగా ఆమె మానస సరోవరంలోని మాదన శీలమైన వికార తరంగాలకు చాలనం కలిగించింది.

"అచలతకు" అంది మళ్ళీ నవ్వుతూ. లోపలికొచ్చిన రాజహంస ఆమెకు మరింత సమీాపానికి వచ్చింది.

"అంటే...?"

"అచలత్వం — నాకు — పర్వతత్వం..." అంది విరగబడి నవ్వుతూ."

"అదా నువ్వు మాటలకు అర్థం చిత్రంగా తీస్తావు సుమా!" అన్నాడు శ్రీలేఖను సమీాపించి ఆమె హస్తాలను మృదువుగా స్పృశిస్తూ.

శ్రీలేఖ సిగ్గుతో తన బరువైన రెప్పలను క్రిందకు వాల్చింది. నళినాక్షుడు మెల్లిగా ఆమెను తన కౌగిట్లోకి లాక్కున్నాడు.

శ్రీలేఖ నళినాక్షుణ్ణి గురించి యిదివరకే కొంత తెలుసు కుంది. తాను అలకా నగరానికి వస్తూవుండగా దారిలో చిత్రరేఖ అనే అచ్చర ఆమెను కొంచెం హెచ్చరించింది: "నువ్వు నళినాక్షుని దగ్గరకు వెడుతున్నావు. జాగ్రత్త! అతడు అందమైన ఆడవాళ్ళను కేవలం తన కామతృప్తి కోసం వుపయోగించుకుంటాడు. అతనికి యెవరినీ స్థిరంగా ప్రేమించే హృదయం లేదు." అని.

కాని అతని గాఢ పరిష్వంగంలో వేడి నిట్టూర్పుల్లో శ్రీలేఖ స్వర్గంతో పాటు చిత్రరేఖ చేసిన హితబోధ కూడా మరిచిపోయింది.

"నువ్వు చాలా అందంగా వుంటావు శ్రీలేఖా!" అన్నాడు ఆమె ముఖాన్ని తనచేత్తో పైకెత్తుతూ నళినాక్షుడు.

"మీరు యిప్పుడు గీసిన చిత్రాన్ని చూసినతరు వాతనే నాకా సంగతి తెలిసింది" అంది మందహాసంచేస్తూ.

"కాస్త మధువు తాగుతావా?"

"వొద్దు నళినాక్షా! నేను వెళ్ళాలి."

"వెళ్ళాలి వెళ్ళాలి! వొచ్చినప్పటినుండి యిదేపాట. కాస్త నిదానించుదూ"

"ఇప్పుడుగాదు మరొక్కప్పుడు తీరికగా కూర్చుం టాను" అంటూ వెళ్ళడానికి ఉద్యుక్తురాలైంది. శ్రీలేఖకు నిజంగా వెళ్ళాలని లేదు. కాని యిప్పుడామె తొందరగా వెళ్ళి తీరాలి.

"రేపు మీరు తప్పకుండా అమరావతికి వస్తారుగదూ" అంటూ బయటికి నడిచింది.

ఆమె అందెల చప్పుడు క్రమంగా క్షీణించే వఱకు నళినాక్షుడు ఆమె వెళ్ళిన దారివంకనే చూస్తూ నుంచున్నాడు. "అమర కాంతకు యింత అమాయకత్వం పనికిరాదు" అని తనలో తాను నవ్వుకున్నాడు. మళ్ళీ వెనుకకు తిరిగి కూర్చిక తీసుకుని శ్రీలేఖ చిత్రానికి అక్కడా అక్కడా మెరుగులు దిద్దడం మొదలు పెట్టాడు.

## 3

శ్రీలేఖ తనకు కలిగిన మధురానుభూతిని మాటి మాటికి స్మరించు కుంటూ అలకాపురం నుండి అమరావతికి చేరుకుంది. ఆమె అలకాపురానికి నళినాక్షుని యింటికి రావడానికి వొక కారణం వుంది. శచీపతికి వొక కోరిక కలిగింది. తనభార్య పులోమజయొక్క స్వరూపాన్ని తన శయ్యామందిరంలో ప్రత్యేకంగా నళినాక్షునిచేత గీయించా లన్నదే ఆ కోరిక. అంటే అమరావతిలో చిత్రకారులు లేక గాదు. కాని, అక్కడి చిత్రకారులు చిత్రలేఖనంలో కంటే కూడా శిలలమీద బొమ్మలు చెక్కడంలో అతి కుశలులు. వారు తమ నేర్పుచూపి చెక్కిన విగ్రహాలు అమరావతిలో

లెక్కకు మిక్కిలిగా వున్నై. వీరి అక్కఱ శచీపతికి యిప్పుడు లేదు. తన వెయ్యి కండ్లతో చూచినా తనివితీరని పులోమజ యొక్క సౌందర్యాన్ని వివిధ వర్ణాలతో అతిసహజంగా గోడ మీద ప్రతి ఫలింప చేసే చిత్రకళా నిపుణుడే శచీపతికి కావల సింది. అట్టివారు అమరావతిలో వున్నట్టు అతనికి తోచలేదు. తన దృష్టిని నళినాక్షుని వైపు మరలించ వలసివచ్చింది.

ఇదివరకొకసారి శచీపతి అలకాపురికి కుబేరుని అహ్వా నం మీద విందుకు వచ్చినప్పుడు, నళినాక్షుని పనితనాన్ని కుబేరుని శుద్ధాంతంలో చూడగలిగాడు. ఆసమయంలో నళి నాక్షు డక్కడ లేడు. అతణ్ణి చూచే అవకాశం లేకపోయింది శచీపతికి. తరువాత అలకా పట్టణానికి వెళ్ళే సందర్భంకూడా కలుగలే దతనికి. అప్పుడు అతనికి నళినాక్షునిమీద కలిగిన అభిప్రాయమే యిప్ప టీ కోరికకు మూలకారణమైంది.

పులోమజ యొక్క చిత్రాన్ని గీయించాలన్న కోరిక పుట్టగానే శచీపతికి నళినాక్షుణ్ణి స్వయంగా వెళ్ళి తీసుకురావాలని పించింది. కాని తాను త్రిలోకాధి పతినన్న అభిమానం ఆ పనికి అడ్డుపడింది. వెంటనే తన త్రిలోకాధి పత్యానికి యెలాంటి భంగమూ వాటిల్లకుండా వొక వుత్తరం నళినాక్షుని పేరట అతణ్ణి అమరావతికి ఆహ్వానిస్తూ రాశాడు.

ఆ వుత్తరాన్ని యెవరిచేత పంపడమా అన్న ఆలోచన శచీపతిని కొంత అవస్థపెట్టిన మాట వాస్తవమే కాని, నిగ నిగలాడుతూన్న నిండు యౌవనంతో నడకలో చూపుల్లో

వొయ్యారాన్ని వొలికిస్తూ తనకు మధువును తీసుకొస్తూ వున్న శ్రీలేఖను చూడగానే శచీపతి వొక నిశ్చయానికి రాగలిగాడు. శ్రీలేఖచేతనే ఆ వుత్తరాన్ని పంపించాలి. రంభాదులు లేరా? వున్నారు. కాని, శ్రీలేఖ యింకా అనాఘ్రాత పుష్పం. పడుచుదనపు పసందులు యిప్పుడే మొగ్గతొడుగుతోంది. కను పరచే ఆకర్షణలో కొంత నూతనత్వం వుండాలి. ఈ రహస్యం శచీపతికి బాగా తెలుసు. అందుకనే తనకోసం తెచ్చిన మధువును వొక యెత్తైన పీఠంమీదపెట్టి వెళ్ళడానికి వుద్యుక్తు రాలౌతూన్న శ్రీలేఖ నుద్దేశించి "నువ్వు వరూధుని చెల్లెలివి కదూ?" అన్నాడు.

"అ - వు - ను - ప్రభూ!" శ్రీలేఖ పిరికి గుండెది. తలయెత్తి పురుషులతో మాట్లాడే జాణతనం కలగడానికి ఆమె కింకా అనుభవం చాలదు. శచీపతి ప్రభువు. తాను దాసి.

"నీపేరే గదూ శ్రీలేఖ?" తెలిసివున్నా అట్లా కనుక్కోవటం అతని దొరతనపు గుణం.

"అవును" అంది తలవంచుకునే శ్రీలేఖ.

"చూడు, యిప్పుడు నువ్వు అలకానగరానికి వెళ్ళాలి. వొంటరిగా వెళ్ళగలవా?" వొంటరిగానే పంపాలని అతని వుద్దేశం. దగ్గరగావచ్చి ఆమెను నిదానించి చూశాడు. సానదీర్చిన సమ్మోహనాస్త్రంలాగా కనుపట్టింది శ్రీలేఖ.

"చిత్తం ప్రభూ!"

"వెళ్ళి నళినాక్షుడనే యక్షుని కీ వుత్తరం యిచ్చి, రేపు అతణ్ణి తప్పకుండా యిక్కడికిరమ్మని చెప్పాలి. తెలిసిందా

మళ్ళీ తొందరగా వచ్చి నాకు యేసంగతీ చెప్పాలి.

శ్రీలేఖ తలవూపింది సరేనన్నట్టు.

"వెళ్ళు. అతని సౌధం చైత్రరథంలో వుంటుంది. నువ్వొక్కర్తివే వెళ్ళాలి తెలిసిందా "అన్నాడు కాస్త అధికార స్వరంతో.

శ్రీలేఖ ఆ వృత్తాన్ని రవిక సందులో దాచుకుని తక్షణమే అలకాపురికి బయలుదేరింది. ఆమె సింహద్వారం దాటి నందన వనంలో అడుగు పెట్టగానే "శ్రీలేఖా!" అని యెవరో పిలిచారు. శ్రీలేఖ వులిక్కిపడి వెనుదిరిగి చూచింది. ఆమె స్నేహితురాలు చిత్రరేఖ. చిరునవ్వు నవ్వుతూ నిలబడివుంది.

"ఎక్కడికి యీ ప్రయాణం?" అంది వొయ్యారంగా ముందరికి నడిచివస్తూ.

"హుష్!" అంది శ్రీలేఖ చూపుడువేలు నోటికడ్డంగా పెట్టుకుంటూ.

"నువ్వెక్కడికి వెడుతూన్నదీ నాకు తెలుసు." అంది మళ్ళీ చిత్రరేఖ. శ్రీలేఖకు కొంత ఆశ్చర్యమూ, కొంత భయమూ కలిగింది. ఆమె యేమీ మాట్లాడలేదు.

"ఇంతసేపూ మీసంభాషణ చాటునుండి వింటూనే వున్నా. నాదగ్గర దాచడమెందుకూ?"

శ్రీలేఖ వెళ్ళడానికి వుద్యుక్తురాలైంది. చిత్రరేఖ ఆమెను చెయ్యి పట్టుకుని పొదరింటి చాటుకు లాక్కువెళ్ళింది.

"నువ్వు నళినాక్షుని దగ్గరికి వెడుతున్నావు జాగ్రత్త! అతడు అందమైన ఆడవాళ్ళను కేవలం తన కామతృప్తి కోసం వుపయోగించు కుంటాడు. అతనికి యెవరినీ స్థిరంగా ప్రేమించే హృదయం లేదు." అంది ప్రతి మాటను బాగా నొక్కి ఆమె గుండెలో హత్తుకుపోయేటట్టు వుచ్చరిస్తూ.

ఇక్కడే ఆలస్యమవుతున్నందుకు శ్రీలేఖ భయపడుతోంది. చిత్రరేఖను మెల్లిగా వదిలించుకుని బయటపడింది.

తను ప్రభువు కార్యంమీద అక్కడికి వెడుదూవుంటే, చిత్రరేఖ యిటువంటి మాటలు యెందుకనాలసి వచ్చిందో శ్రీలేఖకు అర్థం కాలేదు. శ్రీలేఖకు లోకజ్ఞానం చాలదు. చిత్రరేఖ నెఱజాణ.

నళినాక్షుణ్ణి చూడగానే శ్రీలేఖ నేత్రపద్మాలు వొక్కసారిగా వికసించినై. నళినాక్షునివంటి పురుషుణ్ణి యిదివరకు చూడలేదు. యికమీద చూడబోదు అని ఆమెహృదయంలో యెవరో నొక్కి నొక్కి పలికినట్లైంది. భావవీథుల్లో యేవో మధుర స్మృతులు నాట్యమాడినై. మానస సరోవరంలో పూలనావలు తెరచాపలు విప్పుకుని కదలసాగినవి. ఫాలభాగం చిరుచెమ్మటచే తడిసిపోయింది.

ఇంతసేపూ నళినాక్షుడు ఆమెను నిదానించి చూస్తూ వున్నాడు. శచీపతి యిచ్చిన వుత్తరాన్ని వణుకుతూన్న చేతులతో శ్రీలేఖ అతని కందిచ్చింది. చెప్పమన్న మాటల్ని తడబడుతూ చెప్పింది.

"నీపేరు ?" అన్నాడు వృత్తాన్ని చదవడం ముగించి నళినాక్షుడు.

"శ్రీ - లే - ఖ" అంది.

"శ్రీ లేఖ - శ్రీలేఖ - యెంత చక్కని పేరు ! రూపానికి తగినట్టు" అన్నాడు ఆమెను సమీపిస్తూ. శ్రీలేఖ మనస్సు మనస్సులో లేదు. అత డామెను స్పృశించి చిత్రం గీయడానికి నాట్య భంగిమలో నిలబెడుతూంటే తనేమీ అనలేక పోయింది.

నళినాక్షుని స్పర్శతో ఆమె కొక నూతనమైన అనుభవం కలిగింది. స్వర్గానికన్నా సుందరమైన లోకాన్ని చూడ గలిగింది. వెన్నెలకన్నా చల్లనికాంతిని అతని చూపుల్లో అనుభవించగలిగింది. అమృతంకన్నా తియ్యని రుచిని అనుభవించగలిగింది. ఒక నూతనోత్సాహంతో పుష్పసముజ్జ్వలమైన వసంత శోభతో ఆమె అలకాపురంనుండి అమరావతికి చేరుకుంది.

# 4

శ్రీలేఖ అమరావతికి చేరుకునేటప్పటికి చాలా పొద్దు పోయింది. నిండు చంద్రుడు వుదయగిరి శిఖరానికి బారెడు పైకి వచ్చేశాడు. ఆమె సూర్యుడు నడినెత్తికి రావడానికి కొంతసేపటికి ముందు అమరావతి వదలింది - గగన చరత్వం

గలవారికి అమరావతినుండి కైలాసగిరిమీదవున్న అలకా నగరానికి వెళ్ళి వొక చిన్నపనిని ముగించుకు రావడానికి యింతకాలం పట్టదు. ఈ సంగతి శ్రీలేఖకు అమరావతిలో అడుగుపెట్టిన తరువాత జ్ఞాపకానికి వచ్చింది. ఆమె గుండెలో దడపట్టుకుంది శచీపతికి యెక్కడ కోపంవస్తుందో యీ ఆలస్యానికని. ఆమెఅడుగులు తడబడినై. మెల్లిగావై జయంతం చేరుకుంది.

శచీపతి అప్పుడే దేవసభ చాలించి యింటికి వచ్చాడు. శ్రీలేఖ వచ్చినప్పుడు అత డేదో దీర్ఘాలోచనలో నిమగ్నుడై వున్నాడు. అందుకని ఆమె వచ్చినసంగతి గమనించనే లేదు. శ్రీలేఖ యెంతసేపు అలా నిలబడిందో ఆమెకే తెలియదు. తన రాకను నోరుతెరచి తెలియజేసుకునేటంత సాహసం లే దామెకు. తన ఆలస్యానికి కారణంగా యేమిచెబుదామా అని ఆమె మనస్సు చాలా అవస్థపడుతోంది.

శచీపతి యిటూ అటూ పచార్లుచేస్తూ ద్వారందగ్గర అవనత శిరస్కయై నిలబడివున్న శ్రీలేఖను చూచాడు.

"శ్రీలేఖా..." అన్నాడు ఆమె ముఖంవైపు తీక్షణంగా చూస్తూ. "ప్రభూ!" అంది శ్రీలేఖ.

"వెళ్ళినపని యేమైంది?"

"రేపు తప్పకుండా వస్తానన్నారు—"

"మరి యింత ఆలస్యం దేనికైంది?"

శ్రీలేఖ గుండెలు ఆగిపోయినంతపని అయింది. ప్రత్యుత్తరం యివ్వడానికి ఆమెకు నోరు పెగల్లేదు. వంచినతల యెత్తకుండా అట్లాగే నిలబడిపోయింది.

" చెప్పు త్వరగా "

" ఏ - మీ - లే - దు - ప్రభూ! " అంది జంకుతూ.

శచీపతి ఆమె ముఖాన్ని పరీక్షగా చూచాడు. తనలో తాను నవ్వుకున్నాడు. శ్రీలేఖలో యింత మానుషత్వం వుండడంలో అతనికి అర్థం కన్పించలేదు.

" ఏమీ లేదా? సరే! నీ సంగతి రేపు విచారిస్తాను. వెళ్ళు అన్నాడు వుత్తరీయాన్ని సవరించుకుంటూ.

శ్రీలేఖ వెళ్ళబోయింది. శచీపతి ఆమెను వుండమని సౌంజ్ఞజేసి " ముందు వెళ్ళి నా రాకను శుద్ధాంతంలో తెలియజేయి " అన్నాడు.

శ్రీలేఖ ఆచోటువదిలి వెళ్ళింది.

శచీపతి యింతవరకు తను తలపెట్టిన కార్యాన్ని పులోమజతో చెప్పనేలేదు. పులోమజనూ ఆమె తత్వాన్నీ అర్థం చేసుకోవడం సుఖాసుఖాలతో అయ్యేపనిగాదు. ఆమెకు యిష్టంలేని యేపనినైనా ఆమెచేత చేయించడం శచీపతికి కాదుగదా, చతుర్దశ భువనాలూ సృష్టించిన పితామహుడి తరంకూడా కాదు. రాయి విసిరి మొహంమీద కొట్టినట్టు " ఊహు " అని నిక్కచ్చిగా ప్రత్యుత్తరం యిచ్చేస్తుంది. అరవైనాలుగు కళలేగాకుండా పులోమజను లాలించి తనకు

అనుకూలంగా ఆమెను నడిపించుకోడమనే వొక కళను ప్రత్యేకంగా అతను అభ్యసించాడు. సమయం కనిపెట్టి ఆమెతో మాట్లాడాలి. కాని ఇప్పుడీ విషయంలో శచీపతి గొప్ప చిక్కులో పడ్డాడు. నళినాక్షుడు చిత్రిస్తూ వున్నంతసేపూ పులోమజ అతనిముందు కూర్చోవాలి. పరపురుషుడు తన అంగసౌష్టవాన్ని పరీక్షగా చూస్తూవుంటే చూసి సహించే వ్యక్తిగాదు పులోమజ. ఇటువంటి పనికి ఆమెను వొప్పించడం యెలాగా అని దీర్ఘంగా ఆలోచించాడు. యెలాగైనా ఆమెను వొప్పించి తీరాలని బయలుదేరాడు.

అంతఃపురంలో ప్రవేశించగానే యెవరో వెక్కి-వెక్కి యేడుస్తున్నట్టు అతనికి వినవచ్చింది. శ్రీలేఖ యేడుస్తూంటే పులోమజ ఆమెను వోదార్చి ధైర్యం చెబుతోంది.

"కారణం?" అన్నాడు గర్జిస్తూ. పులోమజ చిరునవ్వు నవ్వుతూ లేచి నిలబడింది. శ్రీలేఖ కొంచెం దూరంగా వెళ్ళి తలవంచుకుని నిలబడింది. శచీపతి లోపలికొచ్చి వొక ఆసనంపైన ఆసీనుడైనాడు. శ్రీలేఖ యిదే సమయమని మెల్లిగా బయటకు తప్పుకుంది.

నడిచివెడుతోంది. యెక్కడికి వెడుతోందో ఎట్లా వెడుతోందో ఆమెకే తెలియదు. చిత్రరేఖయెదురుపడి పలకరించినా కూడా పలకకుండానే యిల్లుజేరుకుంది శ్రీలేఖ. ఎందుకో దుఃఖం పొంగిపొరలి గట్లుతెంపుకుని పైకిరాగా పరుపుమీద బోర్లపడి వెక్కి-వెక్కి యేడ్చింది.

రేపు తనసంగతి కనుక్కుంటా నన్నాడు శచీపతి. ఎందుకు? తనుచేసిన తప్పేమిటి; నిజం చెబుతే తనకు తగిన శిక్ష యేమిటి? అసలు శిక్షించడం దేనికి? ప్రభువు కార్యం మీద వెళ్ళి, ఆలస్యం చేస్తే అతనికి కోపంరాదా? మరి ఆ జ్ఞానం అప్పుడు తన కెందుకు లేకపోయింది? యేమో! కాలపరిమితినీ, స్థలపరిమితినీ మరిపింపజేసేశక్తి నళినాక్షునిలో యేదో వుండాలి! లేకపోతే తను ప్రభువుమాట యెప్పుడైనా జవదాటి యెరుగునా? ఈ ఆలస్యానికి కారణంగా తను యేమి చెప్పాలి?

శ్రీలేఖ మనోనౌక ఝుంఝూ వాతంలో చిక్కుకున్నట్లు అల్లాడి పోయింది.

"స్వారాజ్యంలో దాసీత్వం — నవ్వొస్తోంది—" ఆమె హృదయంలో నళినాక్షుడు నవ్వాడు. ఉలిక్కిపడి లేచి కూచుంది. అమరావతిలోని మణిదీపాల కాంతిలో వాతాయనంలోనుంచి కనబడుతూన్న చంద్రుడు వెలవెలబోయిన ముఖంతో కనుపించాడు. ఆశ్చర్యం! అప్పుడే తెల్లవారబోతోందా? తను యెంతసేపు యేడ్చింది? యెంతసేపు ఆలోచించింది? ఏమాలోచించింది? లేదు లేదు. ఇంకా అర్ధరాత్రే. వీణా నినాదాలు యింకా అక్కడక్కడా వినబడుతూనే వున్నవి.

ఇప్పుడు నళినాక్షుడు తనదగ్గర వుంటే యెంత బాగుండును! రేపు అతను యిక్కడికి వచ్చినప్పుడు శచీపతి

తనను అతనిని కలుసుకోడానికి ఏలుపడనిస్తాడా? ఎందుకు పడనివ్వడు? తను కేవలం పరిచారికా వృత్తికోసం పుట్టింది! రంభాదులకన్నా తను యేవిషయంలో తీసిపోయింది. నృత్య గీతాదులలో తనకు నేర్పు లేదా?

ఇల్లా ఆలోచిస్తూ వుండగానే తూర్పు తెల్లవారి పోయింది.

ఒక వేత్రహస్తుడు వచ్చి "ప్రభువు రమ్మంటున్నా" డని శ్రీలేఖతో చెప్పి వేగంగా వెళ్ళిపోయాడు.

శ్రీలేఖ గుండెలో దడ హెచ్చింది. తొందర తొందరగా అలంకరించుకుంది. శరవేగంతో వైజయంతం చేరుకుంది.

ఆశ్చర్యం! తను వున్నది స్వప్నావస్థలోనా? కాదు కాదు! రెప్పలల్లార్చి ఆశ్చర్యంతో చూసింది. శచీపతి పక్కన నళినాక్షుడు కూర్చుని వున్నాడు. పున్నమచంద్రుడిలా నవ్వుతున్నాడు. కలువలా ఆమె హృదయం వికసించింది. "చూడు శ్రీలేఖా! నళినాక్షుడు వచ్చాడు. నిన్న నీ ఆలస్యానికి కారణంగూడా చెప్పాడు." అన్నాడు శచీపతి.

శ్రీలేఖ యేమీ మాట్లాడలేదు.

"నువ్వు చేసినపనికి శిక్ష యేమిటో తెలుసా"

"... ... ... ..."

"నళినాక్షుడు అమరావతిలో వున్నంతకాలం అతనికి యేలోటూ రాకుండా చూస్తూ వుండాలి, తెలిసిందా!" అన్నాడు అధికార స్వరంతో.

శ్రీలేఖ సిగ్గుతో తలవంచుకుంది.

## ౫

నళినాక్షుడు అమరావతికి వచ్చి అప్పుడే వారంరోజు లైంది. మొదటి రెండు మూడు రోజులు అతనికి వృధాగానే గడిచిపోయింది. అసలు తను వచ్చిన పని కాకుండానే తిరిగి వెళ్ళిపోవాలసి వస్తుందేమో నన్న సందేహం కూడా కలిగిం దతనికి. నాలుగో నాటికి గాని పని కుపక్రమించలేదు నళినాక్షుడు.

తన వుద్దేశాన్ని పులోమజతో ముందుగానే చెప్పి, ఆమె అంగీకారాన్ని పొందకుండా నళినాక్షుణ్ణి పిలిపించి నందుకు శచీపతి నాలుక కొరుక్కున్నాడు. ఆమెను అనున యించి ఒకదారికి తీసుకురావడానికి భగీరథ ప్రయత్న మైంది. బృహస్పతి సహాయం లేకుండా ముల్లోకాలూ పరి పాలించగల సామర్థ్యం, వాక్చాతుర్యం గలవాడే! అయినా...

ఏ భంగిమలో వుంటే పులోమజ తన కింపుగా కనబడు తుందో ఆ భంగిమను వర్ణించి, అలా గీయమన్నాడు శచీపతి. నళినాక్షుని దృష్టికి ఆ భంగిమలో సొంపు కనిపించలేదు. కళాదృష్టితో నళినాక్షు డొక చక్కని భంగిమను సూచించాడు. శచీపతి ఆ భంగిమలో పులోమజ వుంటే యెట్లా వుంటుందో వూహలోనే చిత్రించుకుని పొంగిపోయాడు.

నళినాక్షుడు తనుసూచించిన భంగిమలోనే పులోమజను వుంచి, శచీపతి శయ్యామందిరంలో చిత్రించడానికి ప్రారం భించాడు. అతనికి కావలసిన వర్ణసామగ్రి అంతా శచీపతి

సమకూర్చి యిచ్చాడు. అతనికి యేసమయానికి యేంకావాలో దాన్ని అందివ్వడానికి శ్రీలేఖను అక్కడనే వుండమని ఆజ్ఞాపించాడు. కాని నళినాక్షునికి ఈ విషయంలో వుండవలసినంత వుత్సాహం లేదు.

ఒకరు గీసిన గీతను దాటకుండా పనిచేయడం చిత్రకారునికి చాల కష్టం. గంగా ప్రవాహంలాగా ముందుకు సాగిపోయే నళినాక్షుని కళాభావాలకు ప్రోదిని కలిగించడానికి బదులుగా తాను త్రిలోకాధి పతియొక్క భార్యనన్న పులోమజ తలబిరుసుతనం ఆనకట్టలా అడ్డు తగలడం మొదలు పెట్టింది. అతి సుకుమార పోషణకు అలవాటు పడడంచేత పులోమజ శరీరం ఒకే భంగిమలో కదలకుండా యెక్కువ కాలం వుండడానికి భాదపడేది. పడుతున్నట్లు నటించేది. ఆ వున్న కొద్దిసేపటిలో కూడా ఆమె అంగసౌష్టవాన్ని పరిశీలించి చూడడానికి నళినాక్షునికి వీలుపడేదికాదు.

నళినాక్షునికి యిటువంటి అవస్థ యెప్పుడూ కలగలేదు. కుబేరుని అంతఃపురంలో తను చిత్రం గీస్తానంటే అక్కడి స్త్రీలంతా యెంతో చనువుగా తనచుట్టూ మూగుతారు. హేమమాలిని కుబేరుని కుమార్తె. అవివాహిత. నళినాక్షుని వద్ద చిత్రకళ నభ్యసించింది. ఆమెయొక్క ప్రతి కదలికా నొక నాట్యభంగిమను స్ఫురింపజేస్తుంది. నళినాక్షుడు ఆమె సౌందర్యాన్ని యెన్ని భంగిమల్లో చిత్రించాడో అతనికే లెక్కతెలియదు. ఆ అంతఃపురంలో అతనికి విసుగంటూ

వుండదు. అక్కడి స్త్రీలు అతణ్ణి చూచిగాని, అతడు అక్కడి స్త్రీలను చూచిగాని సంకోచ పడడమన్నమాట వుండదు. యెవరి గౌరవం వారు కాపాడుకుంటారు. అతని కళోపాసనకు యెంత స్వేచ్ఛకావాలో యెంత ప్రోత్సాహంగావాలో అంతా ఆ శుద్ధాంతలో అతనికి లభిస్తుంది. కుబేరుని కళాప్రియత్వం యిందుకు మూలకారణం.

శచీపతికి కళాభిరుచి కుబేరునికన్నా యెక్కువవున్నా పులోమజయొక్క ప్రవర్తన శచీపతినీ నళినాక్షుణ్ణీ చాలా నిరుత్సాహ పెట్టింది. తిన్నగా సాగితే రెండు దినాల్లో జరగవలసిన పని వారం రోజులకు పైగా అయినా పూర్తి అయ్యే మార్గం కనబడలేదు. నళినాక్షుడు వూహాతోనే చిత్రాన్ని చాలాభాగం పూర్తిచేస్తూ వస్తున్నాడు. శచీపతికి భార్యమీద చాలా ఆగ్రహం కలిగింది. అయినా దాన్ని వెలిగ్రక్కడం వల్ల వచ్చే ఫలితం విపరీతంగానే వుంటుంది గాని, ప్రయోజనం మాత్రం వుండదు. తన భార్య యింత మూర్ఖురాలా! శచీపతి హృదయం చాలా పరితపించింది. మెల్లిగా శయ్యామందిరంలో ప్రవేశించాడు. అతనికి యెక్కడా లేని ఆశ్చర్యం కలిగింది. పులోమజ వొంటరిగా నిలబడి అక్కడ గోడమీది అఱకొఱగా పూర్తియైన తనచిత్రాన్ని చూసి తనలో తానే నవ్వుకుంటూ, అద్దంలో తన సౌంద ర్యాన్ని చూసుకుని మురిసిపోతోంది. మరి తనకు అట్లా చిత్రం గీయించుకోడం బొత్తిగా యిష్టంలేనట్లు నటించడం దేనికి?

"శచీ !——" అన్నాడు ఆమెను సమీపిస్తూ.

పులోమజ చూపుల్లో శృంగారాన్ని వొలికిస్తూ వొయ్యారంగా వొకపక్కకు వెళ్ళి నిలబడింది.

"నా హృదయాన్ని యెందు కిలా క్షోభ పెడతావు ? అన్నాడు దీన వాక్కులతో.

"నావల్ల యేదైనా తప్పు జరిగితే నన్ను క్షమించండి. మీ హృదయాన్ని క్షోభింపజేయడం నా మతంగాదు"

"పిచ్చిదానా, నన్ను కష్టపెట్టడం నీకు యిష్ట మన్నానా ?" సౌందర్య సామ్రాజ్యంలో అగ్రాసనాన్ని అధిష్టించిన నీ రూపాన్ని నానా వర్ణాలతో ప్రతిభింబింపజేసి చూసి, నేత్రానందాన్ని పొందాలన్న నా కోరికకు దోహదం యెందుకు చేయవు ?"

"మీ కోరికకు అడ్డు తగిలిం దెవరు ? చిత్రం గీయడం జరుగుతూనే వుందిగదా"

"నళినాక్షుడు చాలాభాగం చిత్రాన్ని వూహతోనే పూర్తి జేస్తున్నాడు. అతని ముందు వున్నంతసేపు నీప్రవర్త నను కొంత మార్చుకోవాలి"

పులోమజ ముఖం కాస్త చిన్నబోయింది.

"మీరు చెప్పేమాటకు అర్ధంలేదు. పరపురుషుని ముందు అట్లా సిగ్గువిడిచి కూర్చోడం నాకు, నాకేగాదు యే మానవతికీ సహించదు."

ఆమె నోటినుండి యీలాంటి ప్రత్యుత్తరమే వెలువడు తుందని శచీపతికి బాగా తెలుసు.

"చిత్రకారుని యెదుట కూర్చున్నంత మాత్రాన నీ మానానికి భంగం కలుగుతుందా? వెఱ్ఱిదానా! అతడు నిన్నుచూచేది కళాదృష్టితో, కాముక దృష్టితో కాదు. నీగౌరవం నాది కాదా?"

"అతడు తిప్పమన్నట్లల్లా ముఖాన్ని తిప్పుతూ కూర్చోడానికి నే నతని దాసీని కాను: అంది విసురుగా పులోమజ"

శచీపతికి నవ్వు వచ్చింది.

"కళా సామ్రాజ్యంలో అధికారులూ, దాసీలు, పరిచారకులూ! యెంత చిత్రంగా వుంది నీ మాట. అక్కడా యీ స్థాన భేదాల పాటింపా! ప్రియా! యెందుకు నీ కింత అమాయకత్వం.

పులోమజ యేమీ మాట్లాడలేదు.

"ఇష్టంవున్నా యిష్టం లేనట్టు యెందుకో నటన!" అన్నాడు ఆమెను తనకౌగిట్లోకి లాక్కుంటూ"

"... ... ..."

"చిత్రం తొందరగా పూర్తి కావాలంటే రెండు రోజులు నువ్వు ఆయాసపడక తప్పదు. నాకోసం యీ మాత్రం శ్రమపడలేవా?"

ఆమె సిగ్గుతో రెప్పలను వాల్చింది.

# 6

వీణా మంజుల నినాదం మధురాతి మధురంగా తరంగో పమంగా తంత్రులనుండి బయలుదేరింది. దంతపు మెట్లమీద నునుపైన వ్రేళ్ళు విచిత్రంగా నాట్యమాడుతున్నై. మిన్నేటి పైడి కలువల సౌరభం పారిజాత సౌరభంతో కలిసి గాలిలో పరుగులు తీస్తూవున్న వీణా గానానికి మరింత తియ్యదనాన్ని కలిగిస్తోంది.

నళినాక్షునికోసం వైజయంతం సమీపంలోనే ప్రత్యేకంగా యేర్పరచిన భవనంలో చంద్రశాలలో పాలరాతితిన్నె మీద కూర్చొని వీణను నాజూకుగా మీటుతోంది శ్రీలేఖ.

"నిత్యజ్యోత్స్నా ప్రతిహత తమోవృత్తిరమ్యా: ప్రదోషా:"

ప్రశాంతమైన వెన్నెల. శ్రీలేఖ కట్టిన తెల్లని కోక వెన్నెల వెలుగులో లీనమైపోయింది. తంత్రుల ధ్వనిమాత్రమే వినబడుతోంది. దంతపు వీణను గుర్తించడం కష్టమైంది.

నళినాక్షుడు ప్రక్కనే వాలు శయ్యమీద శ్రీలేఖకు అభిముఖంగా వొత్తిగిలి పరుండి తన్మయుడై సంగీతాన్ని ఆలకిస్తున్నాడు.

శ్రీలేఖ సంగీతాలాపనలో లీనమైంది. మధ్య మధ్య ఆత్మానందాన్ని పొందుతూన్న మహాయోగినిలా రెండు కన్నులు మూసుకుంటోంది. తంత్రీధ్వనితో మిళితమైవచ్చి ఆమె మధుర కంఠధ్వని నళినాక్షుణ్ని పులకితుణ్ణి చేస్తోంది.

అతడు మెల్లిగా లేచివచ్చి ఆమెకుసమీపంలో ఆసీనుడైనాడు. పాట పూర్తికాగానే వీణను క్రిందపెట్టి, సిగ్గుతో లేచి నిలబడింది శ్రీలేఖ. నళినాక్షుడు ఆమెను తీసుకొచ్చి తనప్రక్కన కూర్చోబెట్టుకున్నాడు.

"యెవరిదగ్గర నేర్చుకున్నావీ వీణవాయించడం? సరస్వతి నేర్పిందా?"

"సరస్వతి వీణ వాయించడం నేను వొక్కసారి మాత్రమే విన్నాను. బ్రహ్మసభలో మా అక్క నాట్యం చేస్తోంటే సరస్వతి స్వయంగా వీణ వాయించింది."

"నేను చాలాసార్లు విన్నాను. నువ్వుకూడా యించుమించుగా అలాగే వాయిస్తున్నావు. నిజంగా యెవరిదగ్గర శిక్షణ పొందావు?"

"మా అక్క నేర్పింది. మీరేమో నా వీణా నాదాన్ని యెంతో యిదిగా పొగడుతున్నారు కాని, నాకింకా సాధన చాలదని మాఅక్క నన్ను యెప్పుడూ చీవాట్లు పెడుతూవుంటుంది."

"ఆ! మీఅక్క యింకా బాగా వాయిస్తుందా! మరి ఆమెను నా కింతవరకూ చూపనేలేదేమి?"

"ఆమె ప్రస్తుతం అమరావతిలో లేదు"

"మరి?"

"భూలోకంలో హిమవత్పర్వత ప్రాంతంలో వొక లోయలో వుంటోంది.

"అక్కడ యెవరినైనా తాపసిని తపోభంగం చేసి, తనవల్లో వేసుకుని అక్కడ వుంటోందా" అన్నాడు. ఈ మాటలునళినాక్షుడు అనాలని అనలేదు. అమరకాంతలపై సాధారణంగా అతనికివుండే అభిప్రాయమే అతని నోటివెంట ఈ మాటలను దొర్లించింది.

"అటువంటిదేమీలేదు. ఒక మహర్షి యిక్కడికి వచ్చి ఆమెను కోరి శచీపతి అనుజ్ఞమీద తీసుకు వెళ్ళాడు."

నళినాక్షుడు నవ్వాడు.

"నేను చెప్పిన మాటలకూ నువ్వుచెప్పే మాటలకూ భావం మాత్రం వొక్కటే"

"పొరపాటు బడుతున్నారు. నా భావం వేరు. ఆ మహర్షి ఒక శిల్పి. అతడు తన శిల్ప విద్యను భూలోకంలో శాశ్వతంగా నిలిపే ప్రయత్నంతో హిమాలయ గుహాలలో అనేకమైన విగ్రహాలను చెక్కుతున్నాడు."

"కావచ్చు. కాని మీ అక్కనే ప్రత్యేకంగా తీసుకు వెళ్ళడం దేనికి?"

"తనకు కావలసిన భంగిమలివ్వగల శిల్పసౌందర్యంతో కూడుకున్న యువతులకోసం అతడు దేశ దేశాలూ తిరిగి చివరకు అమరావతికి వచ్చాడు. అమరకాంత లందరిలో మా అక్క వరూధిని యొక్క అంగ సౌష్టవం అతని దృష్టిని ఆకర్షించింది. మా అక్కకు కూడా ఆ విద్య నేర్చుకోవాలనే అభిలాష చాలారోజులనుంచీ వుండడంచేత ప్రభువు ఆజ్ఞ

తీసుకుని అతనితో వెళ్ళింది. శచీపతి కూడా సంతోషంతో, వారిద్దరూ వుండడానికి ఆ లోయలోనే వొక ప్రత్యేక భవనాన్ని నిర్మించి యిచ్చాడు. అప్పుడప్పుడూ మేమంతా అక్కడికి వెళ్ళి వస్తూవుంటాము."

"నీ మాటలనుబట్టి చూస్తే మీ అక్కలో నాకొక ప్రత్యేకత వున్నదనిపిస్తోంది. ఆమెను చూడాలనిపిస్తోంది. ఆమె పరిచయభాగ్యం నాకెప్పుడు కలుగజేస్తావు?"

"మీరు యెప్పుడనుకుంటే అప్పుడే. ఇంకా యిక్కడి పని మీకు యెన్నిరోజులు పడుతుంది?"

"మీ రాణి చాలా గడుసుది. తన అందాన్ని యెవరో కొరుక్కు తింటారనుకుంటుంది. చిత్రం యీపాటికే పూర్తి కావలసినది. ఆ స్థానంలో నువ్వేగనక వుంటే యీ పాటికి యెన్నో చిత్రాలు గీసి పడేసేవాణ్ణి."

"పాపం! ఆ స్థానంలో నేనుంటే మీదగ్గరికొచ్చి యిలా కూర్చుంటానా!" అంది తన విశాలమైన కళ్ళను విలాసంగా తిప్పుతూ.

"నళినాక్షుడు ఆమె సన్నని నడుముచుట్టూ తన హస్తాన్ని పోనిచ్చి ఆమెను దగ్గరకు లాక్కున్నాడు.

"శచీపతి మీరు గీసిన యీ చిత్రానికి బహుమానం యేమి యిస్తారనుకుంటున్నారు?"

"నాకు తెలియదు. అతడు తలచుకుంటే యేదైనా యివ్వగలడు."

"మిమ్మల్నే కోరుకోమంటాను, అప్పుడు ?"

"నువ్వు కావాలని కోరుతాను. ఆ శిల్పి మీఅక్కను కోరినట్టు"

"అబ్బ యెంత ఆశ !" అంది దూరంగా తప్పించుకోడానికి ప్రయత్నం చేస్తూ.

నళినాక్షుడామెను గాఢపరిష్వంగబద్ధురాలిని చేసాడు. ఆకాశంమీద పరుగులు తీస్తూవున్న చంద్రుడు వీరిద్దరినీ చూచి నవ్వుతూ మబ్బుతెర చాటుకు వెళ్ళాడు కొంతసేపు.

# 7

"తాతా... !" శ్రీలేఖ నెమ్మదిగా పిలిచింది.

"... ... ..."

"మా అక్క యేదీ ?" కాస్త సమీపానికి వచ్చి ప్రశ్నించింది.

గుహ అంతా నిశ్శబ్దంగా వుంది. జీర్ణించిపోయిన శరీరం; వృద్ధాప్యంతో తెలుపెక్కిన తలవెండ్రుకలు. అయినా వుత్సాహంతో పాలరాతిమీద సుత్తెతో వొక స్త్రీమూర్తిని చెక్కుతున్నాడు వొక వృద్ధ మానవుడు. సంవత్సరాల తరబడి కష్టించి ఆర్జించిన తపఃశ్రీ అతని కన్నులలో తాండవమాడుతోంది. "టక్ టక్" మని వేస్తూన్న సుత్తెదెబ్బలు మాత్రం ఆ గుహాలోని నిశ్శబ్దానికి అంతరాయం కలిగిస్తోంది.

ఆ స్త్రీ విగ్రహం చెక్కడం పూర్తయి రెండు మూడు రోజు లైంది. దాని కిప్పుడు పై మెరుగులు దిద్దుతున్నాడా ముదుసలి శిల్పి.

"తాతా... !" మళ్ళీ పిలిచింది శ్రీలేఖ.

శిల్పి పలకలేదు. తదేక ధ్యానంతో చెక్కుతున్నాడు. నళినాక్షుడు శ్రీలేఖ వచ్చినట్టు అతను గమనించనే లేదు.

"మళ్ళీ పిలవాలని నోరు కదిపింది శ్రీలేఖ."

"హుష్! అతనికి అంతరాయం కలిగించకు" అని వారించాడు నళినాక్షుడు శ్రీలేఖను."

నళినాక్షుడు గుహనంతా పరిశీలించి చూస్తున్నాడు. గుహ స్వతస్సిద్ధంగా యేర్పడినది కాదు. చేత్తో తొలచబడి వుంది. చిత్రమైన పనితనంతో అనేకమైన విగ్రహాలు ఆ గుహనిండా చెక్కబడివున్నై. శ్రీలేఖ నిశ్శబ్దంగా నళినాక్షునికి వొక్కొక్క విగ్రహాన్నే చూపిస్తూ గుహలోపల తిప్పుతోంది. నళినాక్షుడు యింతటి పనితనం గల శిల్పిని అమరావతిలో గూడా చూడలేదు. ఈ గుహనంతా వొక్క ముదుసలి తొలిచాడా! అతను నమ్మలేక పోయాడు. శ్రీలేఖ అతణ్ణి ఆ గుహలోంచే పక్క గుహలోకి తీసుకు వెళ్ళింది. నళినాక్షుడు చకితుడై చూస్తూవున్నాడు. ఒకే స్త్రీమూర్తి. అనేకమైన నాట్య భంగిమల్లో చెక్కబడివుంది. అవి విగ్రహాలా! రాతిమీద చెక్కబడ్డవేనా! మరి ఆ జీవకళ యెక్కడి నుండి వచ్చింది వాటికి? ఆహా! ఏమి శిల్పి! అతడు మానవుడు కాడు. బ్రహ్మ! ఇప్పుడా శిల్పి పాలరాతిమీద చెక్కుతున్నది

కూడా ఈ స్త్రీదే! తనూ ఒక చిత్రకారుడే. తన వూహాకు యిటువంటి స్త్రీ స్వరూపం యెప్పుడైనా తట్టిందా! తనూ యెంతమంది స్త్రీలను చూడలేదు! ఇంత సౌందర్యంగల స్త్రీని చూడగలిగాడా! శ్రీలేఖను చూచాడు పక్కకు తిరిగి.

"శ్రీలేఖా...! ఇందులో నీ పోలికకూడా కొంత కనిపిస్తోంది." అన్నాడు.

"ఈ విగ్రహాలన్నీ మా అక్క వరూధినిని చూసి చెక్కినవే."

నళినాక్షుడు గంభీరంగా నిలబడి ఒక దీర్ఘ నిశ్వాసం విడిచాడు.

"ఈ శిల్పి ధన్యుడు. అతని తపస్సు ఫలించింది. ఎటువంటి సుందర స్వరూపానికోసం కళాకారులు తపస్సు చేస్తుంటారో అటువంటి దివ్యమూర్తి అతనికి సాక్షాత్కరించింది." అన్నాడు వుద్రేకంతో.

శ్రీలేఖ మందహాసంచేస్తూ నిలబడింది.

"శ్రీలేఖా...!" అన్నాడు ఆమె రెండు భుజాలపైనా తన హస్తాలను వుంచుతూ. "నేనూ యెంత మంది స్త్రీలనో చూచాను. చిట్టచివరకు నన్నాకర్షించింది నీ స్వరూపం. ఈ విగ్రహాలముందు నీ స్వరూపంగూడా శోభించడం లేదు నాకు."

"మీ మాటల్లో అతిశయోక్తి లేదు. ఆమె స్త్రీలనే మోహింప జేస్తుంది."

"ఆమె యిప్పుడు యెక్కడికి వెళ్ళిందంటావు ?"

"బహుశా యింటికి వెళ్ళిందేమో ! అక్కడికే వెడదాం పదండి."

సంధ్య సమీపించటంచేత లేజీకట్లు క్రమంగా గుహలో వ్యాపించడం మొదలు పెట్టాయి. శిల్పి యింకా చెక్కుతూన్న చప్పుడు వినబడుతూనేవుంది. హఠాత్తుగా శబ్దం ఆగిపోయింది.

"ఇంక లే తాతా ! చీకటి పడుతోంది." ఒక కోమల కోకిల కంఠం వినిపించింది.

తాత వికటంగా నవ్వి "చీకటి ! హు ! జ్యోతుల్లా మెరిసే నీ కళ్ళూ, వెన్నెలను ధిక్కరించే కాంతితో నవనవ లాడే నీ శరీరం నాయెదుట వుండగా చీకటి యెక్కణ్ణించి వస్తుంది వరూ !" అంటున్నాడు.

నిన్నటి నుండి మంచినీళ్ళయినా ముట్టుకోలేదు. నీకు ఆకలికావడం లేదా తాతా ?"

"నీ స్వరూప సందర్శనంతోనే నాకు అమృతం లభించింది. ఆకలి దప్పులకు నాదగ్గర తావులేదు." మళ్ళీ చెక్కుతున్న చప్పుడు.

"నీకు పిచ్చి పట్టింది తాతా !"

"నీ సుందర స్వరూపం యెవరికి పిచ్చి యెత్తించదు" మళ్ళీ నవ్వాడు శిల్పి.

"కవిత్వం చాలించి యింక రా వెడదాం తాతా !"

సుత్తె చప్పుడు మళ్ళీ ఆగింది.

"ఈ జన్మలో నేను శిల్పిని మాత్రమే; కవినిగాను. కర్మ పరిపాకం సరిగ్గా వుంటే యేజన్మలో నైనా కవిగా పుట్టి పవిత్రమైన తుంగభద్రా నదీతీరంలో కూర్చుని తియ్యని తెలుగు భాషలో నీ రూపాన్ని వర్ణిస్తూ కాలంగడపాలని పిస్తుంది నా కప్పుడప్పుడూను."

"ఈ జన్మతో నీకు మానవత్వం పోయి అమరత్వం సిద్ధిస్తుంది తాతా! మళ్ళీ నీవు భూలోకంలో పుట్టవు"

"తాత మళ్ళీ నవ్వాడు.

"దేవలోకంలో వుండే యోగ్యత నా కెప్పుడూ కలగదు. నిన్ను ఆరాధించడంవల్ల నాకు అమరత్వం మాత్రం సిద్ధిస్తుంది. భూలోకమే నాకు శరణ్యం. నాకు మళ్ళీ పుట్టుక లేదని బ్రహ్మదేవుడు కూడా చెప్పలేడు.

నళినాక్షుడూ శ్రీలేఖా మొదటి గుహలోకి వచ్చారు.

"అక్కా!" అంటూ వొక్క పరుగున వచ్చి కౌగలించుకుంది శ్రీలేఖ.

"ఎప్పుడు వచ్చావు చెల్లీ! యెన్ని రోజులైంది నిన్ను చూచి" అంది వరూధిని శ్రీలేఖను ముద్దుపెట్టుకుంటూ.

నళినాక్షుడు వరూధినిని రెప్పవాల్చకుండా చూస్తు న్నాడు. తన హృదయ కుడ్యంమీద ఆమె స్వరూపాన్ని వివిధ వర్ణాలతో చిత్రించుకుంటున్నాడు.

శిల్పి మళ్ళీ చెక్కుతూ కూర్చున్నాడు.

నళినాక్షుణ్ణి గురించిన విషయమంతా శ్రీలేఖ తన అక్కకు చెప్పి, ఆమెతో అతనికి పరిచయం కలుగజేసింది.

వరూధిని మందహాసం చేసింది. "మీ విషయమై యిది వరకు రెండు మూడుసార్లు విన్నాను. కాని మీ పరిచయ భాగ్యం యిప్పుడే నా క్కలిగింది. నా ఆనందం నోటితో చెప్పలేను" అంది నళినాక్షునితో.

"నాకూ అంతే" అన్నాడు నళినాక్షుడు నవ్వుతూ.

"ఈయన విషయమై నీ కెవరు చెప్పారు?" అని అడిగింది శ్రీలేఖ"

"చిత్రరేఖ..." అంది వరూధిని.

చిత్రరేఖ పేరు వినగానే నళినాక్షుని ముఖంలో కొంత మార్పు గుర్తించింది శ్రీలేఖ. ఆ మార్పు యెందుకో ఆమెకు అర్థం కాలేదు.

"చిత్రను చూసి నేను పదిరోజులైంది. నాకు దాన్ని కలుసుకోడానికే తీరికలేదు" అంది శ్రీలేఖ.

"ఇప్పుడు అమరావతిలో పని పూర్తి అయిందను కుంటా" అంది వరూధిని.

"ఒక విధంగా పూర్తి అయింది." అన్నాడు నళినాక్షుడు.

"బహుమానం యేం లభించింది?"

నళినాక్షుడు గంభీరంగా బదులుచెప్పాడు. 'శ్రీలేఖ'అని.

శ్రీలేఖ సిగ్గుతో తల నేలకు వాల్చింది. వరూధిని వొక్క సారి శ్రీలేఖను గాఢాలింగనం చేసుకుంది.

శిల్పి చెక్కడం చాలించి లేచి నిలబడ్డాడు. శ్రీలేఖ వంకా నళినాక్షుని వంకా పరీక్షగా చూచాడు. ఒక పెద్ద

నవ్వి నవ్వాడు. ఒక్క క్షణం నిశ్శబ్దంగా వుండి, యింకా పెద్దగా నవ్వాడు. ఆ నవ్వుకు గుహ ప్రతి ధ్వనించింది. నళినాక్షుని హృదయం యెందుకో చలించింది. శ్రీలేఖ ముఖం వెలవెల బోయింది. వరూధినికి యేమీ అర్థంకాలేదు. గుహ అంతా చీకటి ఆవరించింది. వరూధిని ధరించిన రత్నా భరణాల కాంతిలో వారు గుహ బయటకు వచ్చారు.

# 8

శచీపతి శ్రీలేఖను నళినాక్షునికి బహూమతిగానే యిచ్చాడు. ఇద్దరికీ గాంధర్వ వివాహం జరిగింది అమరావతిలో. ఇంక ఆమె అలకానగరంలో నళినాక్షునితోనే వుండడానికి అనుజ్ఞ యిచ్చాడు. శ్రీలేఖ పొంగి పోయింది. తన అంత అదృష్టం చేసుకున్న స్త్రీ మరొకతె పుట్టివుండదని. తన అక్కకు నళినాక్షుణ్ణీ, ఆమె విషయం విన కుతూహలంతో ఆమెను చూడాలని కోరుతూన్న నళినాక్షునికి తన అక్కనూ చూపే వుద్దేశంతో ఆమె వరూధిని వద్దకు వచ్చింది అలకానగరానికి వెడుతూ.

నళినాక్షుడు అమరావతిలో వుండగా శ్రీలేఖ తనఅక్క విషయమై చెబుతూవుంటే ఆమెను ఒక విధంగా తన వూహాలో చిత్రించుకున్నాడు. తన కళావిదగ్ధ మేధస్సుతో అతినేర్పుగా చిత్రించుకున్నాడు. అంతకన్నా గొప్పగా అతను చిత్రించుకోలేక పోయాడు. తన ఊహాచిత్రం సరైనదే నని అతడు తలపోశాడు. కాని... పొరపాటు.

"చిత్రలేఖనానికి నీ స్వరూపం అనుకూలించినట్టు మరెవరిదీ కాదు" అని శ్రీలేఖతో అంటే "మీరు మా అక్కను చూస్తే నన్నిలా వర్ణించరు" అని శ్రీలేఖ బదులు. "నీ కన్నుల తీరు మరెవర్లోనూ నేను చూడలేదు" అంటే "మా వరూధిని కన్నులముందు నా వేపాటి" అని ఆమె అన్నది. "నీవు సరస్వతిలాగే వీణ వాయిస్తావు" అంటే "మా అక్క నా కింకా సాధన చాలదని నన్ను చివాట్లు పెడుతుంది" అన్నది. ఈ కొలతతో అతను వరూధినిని వూహించుకున్నాడు.

ప్రత్యక్షంలో వరూధిని స్వరూపం తన వూహాలోనిది కాదు. తన వూహకు యిటువంటి స్వరూపం యెప్పుడూ అందలేదు.

ఆమె శరీరంలోని వంపులను చిత్రించడానికి తన హస్తానికి నేర్పు చాలదేమో! అని భయపడ్డాడు. ఆమె శరీర లావణ్యాన్ని యెత్తి చూపించడానికి సరియైన వర్ణ మిశ్రణ తనకు చేతకాదేమోనని సందేహపడ్డాడు. అసలు చిత్రలేఖనమే తనకు చేతకాదేమో ననిపించింది. శ్రీలేఖ యెంతో నేర్పుతో వీణ మీటగలదు. అయినా ఆమెకు సాధన చాలదట. తన చిత్రకళా నైపుణ్యం శచీపతిని కూడా ఆకర్షించింది. అయినా తనకుకూడా యింకా సాధన అవసరం. వరూధిని రూపు రేఖలు చూసిన తరువాత అత నట్లా డీలుపడిపోయాడు. ముసలి శిల్పి మీద అతనికి యీసుకూడా కలిగింది. అతని పనితనాన్ని మెచ్చుకోకుండా వుండలేక పోయాడు.

సంధ్యారాగానికి బంగారు రంగులోకి దిగిన మంచు శిఖరాలను చూస్తూ గవాక్షం దగ్గర నిలబడి ఆలోచిస్తున్నాడు నళినాక్షుడు.

"దీర్ఘాలోచనలో వున్నట్టుందే" వీణాధ్వనిలా విని పించింది శ్రీలేఖకంఠం. వెనుకకు తిరిగి చూచాడు. దోసిలితో మల్లెపూలను అతనిమీద చల్లింది కిలకిల నవ్వుతూ.

"మీ అక్క యేదీ?" అని అడిగాడు.

"గుహలోంచి యింకా రాలేదు."

"మనం యిక్కడ ఆమెకు అతిథులుగా వుంటున్నా మని ఆమెకు తెలుసా?"

"తెలుసు కాని, శిల్పి ఆమెను వొక్కక్షణం విడిచి వుండలేడు."

"మర్త్యునకు అమృత భాండం లభించింది. అతను అమరులను మించడానికి ప్రయత్నిస్తున్నాడు. అతని తపస్సు అతని కంతటి శక్తిని కలుగజేసింది." అన్నాడు అటూ ఇటూ పచార్లు చేస్తూ.

"మీ మాటలు నా కర్థం కావడంలేదు."

అతను నవ్వాడు.

"అర్థ మవడానికి యిందులో యేముందీ? మీ అక్క ఆనందస్వరూపం, అమృతభాండం. ఆ శిల్పికి లభిం చింది. అతడు ఆస్వాదిస్తున్నాడు, అనుభవిస్తున్నాడు. అతని నుండి ఆనందాన్ని వేరుచేయడం నాకు యిష్టంలేదు- కాని.." యేదో చెప్పబోయి వెనుకకు తగ్గాడు.

"మీరు మనసులోనే యేదో మథనపడుతున్నారు."

"అవును శ్రీలేఖా! నువ్వు నిజం గ్రహించావు. ఏ దేవతను గూర్చి తపస్సుచేస్తే ఆ దేవత ప్రత్యక్షమవుతుంది." పెద్ద నవ్వుతో కలిసి వినిపించిన వా మాటలు.

ఇద్దరూ ఆశ్చర్యంతో వెనుకకు తిరిగి చూచారు. ముసలిశిల్పి వచ్చాడు. ఒక ఆసనంమీద కూర్చున్నాడు.

'నళినాక్షుని మనస్సు మదనపడుతోంది' అన్నాడుశిల్పి.

శ్రీలేఖ యేమీ మాట్లాడలేదు. నళినాక్షుడు అతని దగ్గరకు వచ్చాడు. "నీవు ధన్యుడవు తాతా! నీ హృదయంలో మదన తగ్గిపోయింది. నీకు కావలసిన అమృతం లభించింది. నాకు హృదయంలోని మదనకు ఫలితంగా అమృతమే పుడుతుందో హాలాహలమే పుడుతుందో."

"అమృతం లభించినా నీవు అనుభవించలేవు. అది నీకు హాలాహలంగానే పరిణమిస్తుంది. అనవసరంగా నీవు మదనపడుతున్నావు."

"తాతా —!" అన్నాడు నళినాక్షుడు. అంతకంటే అతను యేమీ అనలేక పోయాడు.

"నేను వెడుతా. పాపం! శ్రీలేఖ అమాయిక" అంటూ వెళ్ళిపోయాడు.

"తాత వాగ్ధోరణి చిత్రంగావుంది" అంది శ్రీలేఖ.

"చిత్రమేమీ లేదు. అతడు సత్యవాది."

"మీ మాటలుకూడా నా కర్థం కావడంలేదు."

"శ్రీలేఖా!" అన్నాడు ఆమెను సమీపిస్తూ.

"నువ్వు మీ అక్కలాగా యెందుకు పుట్టలేదు?" అన్నాడు.

శ్రీలేఖకు యేదో అర్థమైనట్టు ముఖం వికసించింది. కిలకిలమని నవ్వింది.

"మీరు శిల్పిలాగా యెందుకు పుట్టలేదు?" అని ప్రశ్నించింది.

"నువ్వు జాణవు..." ఆమెను దగ్గరకు లాక్కున్నాడు.

శ్రీలేఖ మౌనం వహించింది.

"ఇప్పుడు శిల్పి యిక్కడకు యెందుకు వచ్చినట్టు? అన్నాడు.

"ఏమో అతనికే తెలియాలి."

"మనం కూడా గుహలోకి వెడదాం పద."

'చంద్రోదయ కాలమైంది. వారే తిరిగివస్తూవుంటారు'

"రానీ, అందరం కలిసే రావొచ్చు—"

ఇద్దరూ చేతులు పెనవేసుకుని గుహాభిముఖంగా నడిచి వెళ్ళారు.

# 9

"కళ అంటే ?" అని ప్రశ్నించింది వరూధిని నిండుగా బరువుగా వున్న రెప్పలను విలాసంగా పైకెత్తుతూ.

ఆ ప్రశ్న వొక రాయిలాగా పడింది. నళినాక్షుని హృదయ సరోవరం కొంత కలకబారింది. బయట వుద్యాన వనంలోవున్న సరోవరంలో దిగి అందులోని కనక కమలాన్ని కోయడానికి ప్రయత్నిస్తూవున్న శ్రీలేఖ వాతాయనంలోంచి కనిపిస్తోంది. వరూధిని వాతాయనం దగ్గర నిలబడింది. ఆ నిలబడటంలో వొక వొయ్యారం, అందులో వొక నేర్పు. అదే వొక నాట్య భంగిమ.

నళినాక్షుడు చిత్రలేఖనం మరచిపోయాడు. తనే వొక చిత్తరువైపోయాడు. వరూధినితో యేకాంతంగా సంభాషించడానికి అతనికి ఆనాడు అదను దొరికింది. శిల్పి ఆవాళ వరూధినికి విశ్రాంతినిచ్చాడు.

ఆమె కట్టింది నీలవర్ణపు పావడ. పైనవేసింది లేత గులాబిరంగు వల్లెవాటు. ఆమె నిలచింది వొక నాట్య భంగిమలో. వాతాయనంలోంచి కనిపిస్తున్నది పచ్చగా గుబురుగా వివిధ వర్ణాలతో కనువిందు గొలిపే పుష్పాలతో నిండిన చెట్ల మధ్యలో తెల్లని హిమగిరి శిఖరాలు. సెలయేళ్ళు, ఆకాశ వీధిలో ఆడుకునే నీలి మబ్బులు. అంతా వొక సజీవమైన చిత్రపటం. చిత్రకారునికి యిటువంటి పొందిక గల వస్తువుని చిత్రించడానికి కుతూహలం కలుగుతుంది.

వరూధినితో మాట్లాడుతూ కూర్చోడానికి నళినాక్షుడు "కళ" అన్న విషయాన్ని తానే కదిపాడు. వరూధిని కళాకోవిదురాలు. చర్చాప్రియురాలు. "కళ అంటే" అని ఒక ప్రశ్నాబాణాన్ని వదిలింది.

నళినాక్షుని కన్నులు వరూధిని కట్టిన నీలి పావడా మడతలను చూస్తున్నవి. ప్రశ్నకు ప్రత్యుత్తరం రాలేదు.

"నాకు కళ విషయమై సరియైన నిర్వచనం కావాలి" అంది మళ్ళీ.

"సృష్టి" అన్నాడు.

"సృష్టి కర్త బ్రహ్మదేవుడు. కళాకారుడు దేన్ని సృష్టించగలడు?" అంది.

"కళాకారుడూ సృష్టించగలడు. బ్రహ్మ యివ్వగల జీవమొక్కటే యివ్వలేడు. కాని జీవకళ యివ్వగలడు. ఇది ప్రతి సృష్టి" అన్నాడు కాస్త వుద్రేకాన్ని కనపరుస్తూ. వరూధిని వొయ్యారంగా ముందరికి నడిచివచ్చి వొక ఆసనం మీద కూర్చుంది.

"ప్రతి సృష్టి అంటే భిన్న సృష్టి. బ్రహ్మ సృష్టించిన దానికి భిన్నంగా మీరు సృష్టించగలరా?" అది అనుకరణ." అంది.

"కళాకారుడు తన నేర్పుతో, వూహతో సృష్టిస్తాడు కళ అతని సృష్టి. అయినప్పుడు ప్రతిసృష్టే అవుతుంది గాని, అనుకరణగాదు"

"నేను బ్రహ్మయొక్క సృష్టి. నా రూపాన్ని ముసలి శిల్పి రాతిమీద చెక్కాడు. ఆ విగ్రహం నా ప్రతిబింబం. ప్రతిబింబం అంటే నా రూపాన్ని అనుసరించివుండేది. నా రూపాన్ని అనుసరించి శిల్పి చెక్కాడు. అప్పు డది బ్రహ్మ సృష్టిని అనుసరించి సృష్టించడం కాదా?"

నళినాక్షుడు మౌనం వహించాడు.

"ప్రతిసృష్టి అనే పదం కళాకారుని అహంభావాన్ని సూచిస్తుంది" అంది.

"నిజమే. మీతో వాదించడం కష్టం" అన్నాడు.

"నాకు చిత్రలేఖనం కొద్దిగా వచ్చు. కాని సరైన శిక్షణ యిచ్చే గురువు నాకు లభించలేదు..." అంది నళినాక్షుని వైపు చూస్తూ.

"అన్ని కళలలో ఆరితేరిన మీకు శిక్షణ యేమిటి" అన్నాడు.

"కాదు. చిత్రలేఖనంలో నాకు పరిపూర్ణత సంపాదించాలని వుంది."

"ఆ కోరికవుంటే దాన్ని సాధించడం మీకు కష్టం గాదు."

"మీవంటి నేర్పరుల సహాయం అందుకు ముఖ్యమైంది"

నళినాక్షుని చెవుల దగ్గరగా తెచ్చి యెవరో వీణ వాయించినట్టయింది. అతని దేహం పులకరించింది.

"మీకు నేర్పడంకన్నా ఆనందకరమైన విషయం నాకు మరొకటి వుండదేమో... కాని"

"ఏదో సందేహిస్తున్నారు...?"

"శిల్పి మిమ్మల్ని విడిచివుండడం కష్టమేమో?"

"అతణ్ణి విడిచి వుండడం నాకూ కష్టమే – అతని పని పూర్తి అయ్యేవరకు నాకు విశ్రాంతి లభించదు."

"శిల్పి పని పూర్తికావడానికి యింకా యెంతకాలం పడుతుంది?"

"యుగాలు కావొచ్చు –" పెద్దగా నవ్వు వినిపించింది. శిల్పి వచ్చాడు. "యుగాల తరబడి నేను పనిచేయవచ్చు – నాకు అంతం రావొచ్చు. అయినా పని మిగిలే వుంటుంది – కాలానికి అంతం వుందా – సముద్రానికి అద్దరి వుందా? అట్లాగే కళకు"

ఇద్దరూ లేచి నిలబడ్డారు. తాత కూర్చున్నాడు.

"నేను రామేశ్వర యాత్ర వెళ్ళి వస్తాను వరూ" అన్నాడు శిల్పి వరూధినివంక చూస్తూ.

"సగం పనిలో విడిచి వెడతావా తాతా?"

"పని యెప్పుడూ వుంటుంది. సముద్రంలో అలలు తగ్గే దెప్పుడు? మనం స్నానం చేసేదెప్పుడు? నాకు రామలింగ స్వామి దర్శనంచేయాలని వుంది. అంతవరకు నీవు విశ్రాంతి తీసుకో —"

"నీ కోరికకు నేను అడ్డుచెప్పను తాతా! అంతదూరం వెడుతున్నావు. పదిలంగా వెళ్ళిరా తాతా!" వరూధిని కన్నులలో నీళ్ళు తిరిగాయి.

“ వెఱ్ఱితల్లికి నామీద యెంత అభిమానం ! నీ ఆశీ ర్వాదం వుంటే, నాకు యే ఆపదా రాదు- నేను వెళ్ళివస్తాను వరూ ! ” అంటూ లేచాడు.

వరూధినీ నళినాక్షుడూ ద్వారం వరకూ వచ్చారు. వికసించిన కనక కమలాలను తూండ్లతో రెండు చేతుల్లో పట్టుకుని యెదురుగుండా వచ్చింది శ్రీలేఖ.

“ నేను రామేశ్వరం వెడుతున్నా తల్లీ ! ” అన్నాడు శ్రీలేఖవైపు చూసి శిల్పి.

శ్రీలేఖ ఆ పద్మాలను అతని పాదాలదగ్గరగా పెట్టి, మౌనంగా నిలబడింది.

“ నేను వచ్చేవరకూ మీ అక్కను జాగ్రత్తగా చూస్తూవుండు శ్రీలేఖా ! ” అంటూ ముందరికి నడిచాడు.

ఆ ముగ్గురూ అతడు వెళ్ళిన దారివంకనే చూస్తూ అట్లానే నిలబడిపోయారు. వరూధిని బరువుగా వొక నిట్టూర్పు విడిచింది. నళినాక్షుడు యేదో బరువు దిగిపోయినట్టు నిశ్వా సం వదిలాడు. శ్రీలేఖ కిందవుంచిన తామర పువ్వుల్ని తీసి కళ్ళ కద్దుకుంది.

“ అతడు క్షేమంగా వెళ్ళి తిరిగిరావాలి ” అంటూ లోపలికి వెళ్ళింది వరూధిని. నళినాక్షుడూ శ్రీలేఖా ఆమెను అనుసరించారు.

# 10

నళినాక్షుడూ శ్రీలేఖా అలకానగరానికి చేరుకున్నారు. నళినాక్షుని వియోగం కుబేరునికి దుస్సహమైంది. అమరావతికి కబురు పంపితే అక్కడ లేడని తెలిసింది. విచారణ చేయగా. వరూధినివద్దర వున్నాడని తెలిసి, దూతను పంపి రప్పించుకున్నాడు కుబేరుడు. నళినాక్షుడు శ్రీలేఖతో వచ్చినందుకు కుబేరునికి చాలా సంతోషం గలిగింది. అతని శుద్ధాంతంలో కూడా అందరూ తమతమ ప్రమోదాన్ని వెలిబుచ్చారు.

మొదట తను నళినాక్షుని ఆహ్వానించడానికి ప్రవేశించిన గృహం తనదే అయినందుకు శ్రీలేఖ పొంగిపోయింది. ఆ దివ్య సౌదానికి తా నిప్పుడు రాణి. ఆ చైత్రరథంకూడా తనదే. నళినాక్షుడు తన భర్త.

నళినాక్షునికి మాత్రం వరూధినిని విడిచి రావడం చాలా కష్టమనిపించింది. ప్రభువు ఆజ్ఞ మీరరానిది. వరూధిని తనకు శిష్యురాలయింది. తనవద్ద చిత్రలేఖనం నేర్చుకుంటోంది. ప్రతిరోజూ వుదయం రెండు గంటలసేపు తనదగ్గరకు వచ్చి వెడుతుంది. ప్రతిదినమూ ఆమె అలా వచ్చి వెళ్ళడం అతని మనస్సు సహించలేదు. ఆమె చిత్రలేఖనంలో పరిపూర్ణత సంపాదించే వరకూ తనవద్దనే వుండమని బ్రతిమాలాడు. ఆమె చిరునవ్వు నవ్వి "నాకు యిట్లా వచ్చి వెళ్ళడమే బాగాఉంది" అని బదులు పలికింది.

వరూధినితో ప్రతిరోజూ గడిపే ఆ కొద్దికాలంలో తను ఆమెకు చిత్రలేఖనం నేర్పుతున్నాడో ఆమెదగ్గర నేర్చుకుం టున్నాడో నళినాక్షునికి తెలిసేదిగాదు. ఆమె మాట్లాడే టప్పుడు ఆమె పెదిమల కదిలికను చూస్తూ కూర్చుసేవాడు. ఆమె మాట్లాడుతున్నదో సంగీతం పాడుతున్నదో అని భ్రమ చెందేవాడు. ఆమె దగ్గరలేనికాలం యుగంలాగా గడిపేవాడు.

విద్య నభ్యసించడంలో వరూధిని శ్రద్ధ అనన్యసామాన్య మైనది. వర్ణ మిశ్రణములో వస్తువులను పొందుపరచి చిత్రించ డంలో ఆమె చూపే దినదినాభివృద్ధి నళినాక్షుణ్ణి ఆశ్చర్య చకితుణ్ణి చేసింది. ఆమెకు ఇదివరకే చిత్రలేఖనంలో నేర్పు వుండి యిప్పుడు తనవద్ద నేర్చుకుంటున్నట్టు అభినయిస్తున్న దని ఆతడు సందేహపడ్డాడు.

ఇట్లా నటించడానికి కారణమేమిటి? అతడి మనస్సు పరిపరి విధాల పరుగెత్తింది. తన ఆజానుబాహు దేహం, స్త్రీలను యిట్టే ఆకర్షించే తన కన్నుల తీరూ, ముఖకమలం యెదురుగుండావున్న నిలువుటద్దంలో చూచుకున్నాడు. ఏదో వింతవిషయం తేలికగా అర్థమయిపోయినట్టు అతని ముఖం వికసించింది.

వరూధినికి తనమీద యేదో వొక అభిప్రాయం వుండి వుండాలి! ఆమె హృదయాన్ని తెలుసుకోడం యెట్లా?

వరూధిని మొదటి రోజుల్లో నళినాక్షునితో చాలా చనువుగా మాట్లాడేది. ఎన్నో పరిహాసవాక్యాలు విసిరేది.

పరిహసించినా నొచ్చుకునేదికాదు. శ్రీలేఖ సమీపంలో లేకపోయినా యేకాంతంలో యెంతసేపో అతనితో మాట్లాడేది.

క్రిమక్రమంగా ఆ పరిహాసాలు; ఆ నవ్వులూ అంతా తగ్గిపోతూ వచ్చినవి. తనకు సందేహం కలిగినప్పుడు తప్ప అతనితో నోరువిప్పి మాట్లాడదు. అత డేదన్నా చెబుతే మౌనంగా వింటూ కూర్చుంటుంది. ఏకాంతంలో నళినాక్షునితో కూర్చోడానికి ఆమె యిప్పుడు అంగీకరించనట్టు శ్రీలేఖనుకూడా తను అక్కడ వున్నంతసేపూ దగ్గిర కూర్చోబెట్టుకుంటుంది.

ఎందుకో యీ వరూధిని యొక్క వింత ప్రవర్తన నళినాక్షునికి అర్థం కాలేదు.

"వరూధినీ మీరు రోజుకురోజు మారిపోతున్నారు" అన్నాడు ఒకనాడు.

"నేను మీ శిష్యురాలిని, బహువచన ప్రయోగం మీకు భావ్యంగాదు" అంది వినయపూర్వకంగా.

"మొదటవున్నట్టుగా నాతో యిప్పుడు వుండడం లేదు. సంభాషించడంకూడా హద్దులోకి దిగింది. కారణ మేమిటో తెలుసుకోవచ్చా?"

"చెల్లెలిభర్తేకదా అని మొదటిరోజుల్లో మూర్ఖంగా ప్రవర్తించాను. క్షమించండి, గురువుతో సరసాలాడితే విద్యకు స్వస్తి చెప్పవలసివస్తుంది" మెరుపులా వెళ్ళిపోయింది.

నళినాక్షుడు బాధ పడ్డాడు. ఇంకొకనాడు వరూధిని అతణ్ణే అడిగింది.

"మీరు రోజుకు రోజు మారిపోతున్నారు" అని.

నళినాక్షుడు మాట్లాడలేదు.

"కోరివచ్చిన వారిపై యిటువంటి వుదాసీనభావం చూపడం న్యాయంగా లేదు," అంది.

నళినాక్షుడు ఆమె నదొక మాదిరిగా చూచాడు.

"విద్య నేర్చుకునేవారికీ నేర్పేవారికీ కూడా శ్రద్ధ వుండాలి. మొదటి రోజుల్లో వున్న వుత్సాహం యిప్పుడు మీలో తగ్గిపోయింది"

"వరూధినీ—" అన్నాడు ఆమె ముఖంలోకి గుచ్చి చూస్తూ. వరూధిని గిరుక్కున తిరిగి వెళ్ళిపోయింది. నళినాక్షునికి ఈటెతో పొడిచినట్టనిపించింది. వరూధిని వుద్యానవనంలోంచి తొందర తొందరగా వెళ్ళిపోతూ వుండడం అతడు వాతాయనంలోంచి చూస్తూ నిలబడ్డాడు. అట్లాగే నిలబడిపోయాడు. ఆమె అందెల చప్పుడు అతని చెవులు యింకా వింటూనే వున్నవి. వెళ్ళే వేగంలో గాలికి రెపరెపకొట్టుకున్న బంగారు రంగు పమిటను అతని కన్నులు చూస్తూనే వున్నవి. ఆమె నాగుపాములా వెళ్ళిపోయింది. ఆమె యింకా పోతూ వునట్టే అతడు చూస్తూవున్నాడు. ఆ దృశ్యం అట్లాగే అతనిలో చిత్రితమైంది. అతడూ వొక చిత్తరువై పోయాడు.

"ఇప్పుడు బాగా తెల్లవారి పోయింది" చాలా దూరాన్నుంచి వినిపించినట్టు వొక కోకిలస్వరం వినిపించింది.

"నిన్న సాయంకాలంనుంచీ మీ రా చోటు విడచి కదల్లేదు." మరికొంత దగ్గరగా వినిపించింది.

"దేన్ని గురించి యీ తపస్సు!"

నళినాక్షుడు వెనుకకు తిరిగి చూచాడు. రాత్రి నిద్ర లేక యెరుపెక్కిన కన్నులతో శ్రీలేఖ దీనంగా అతనివంక చూచింది. అత డేమీ పలుకలేదు.

ముఖప్రక్షాళనానికి కనక కలశంలో వున్న పన్నీటిని అతనికి అందివ్వ బోయింది. అతడు అందుకోలేదు. దేన్నో ఆలోచిస్తున్నట్టు నిలబడిపోయాడు.

శ్రీలేఖ కన్నులలో నీళ్ళు తిరిగాయి.

"నావల్ల యేదైనా తప్పు జరుగుతే నన్ను క్షమించండి" అంది గద్గదికంగా.

" ... ... ... "

"మీరు మనస్సులోనే యేదో మథన పడుతున్నారు" అంది.

నళినాక్షునికి శిల్పి నవ్వినట్టు వినిపించింది. శిల్పి వచ్చాడేమోనని అతడు భయపడ్డాడు. "అమృతం లభించినా నీవు అనుభవించలేవు. అది నీకు హాలాహలంగానే పరిణమిస్తుంది" ఆనాటి శిల్పి మాటలు అతనికి చెవుల్లో గింగురుమన్నాయి. అది శాపమా?"

"నన్ను యేకాంతంగా వుండనివ్వు—" అన్నాడు నళినాక్షుడు.

శ్రీలేఖ కన్నీళ్ళు తుడుచుకుంటూ లోపలికి వెళ్ళిపోయింది. అతడు వాతాయనంలోంచి చూస్తూ నిలబడ్డాడు.

# 11

శిల్పి రామేశ్వర యాత్రనుంచి యింకా తిరిగిరాలేదు. అతడు వెళ్ళి పది నెలలకు పైగా గడచినది. ముసలి తపసి కాలినడకను హిమగిరినుండి రామేశ్వరంవరకూ వెళ్ళిరావాలి. వరూధినికి అతని వియోగం రోజుకు రోజూ దుస్సహమై పోయింది. చిత్రలేఖనం నేర్చుకుంటూ ప్రతిరోజూ అలకా నగరానికి వెళ్ళివస్తూ వుండడంచేత శిల్పి దగ్గరలేని తనాన్ని కొంత మరిచిపోగలుగుతోంది.

మొదటనే తనకు చిత్రలేఖనంలో కొంత అభ్యాసం వుండడంచేత ఈ స్వల్పకాలంలో వరూధిని చిత్రలేఖనంలోని అన్ని రహస్యాలను తెలుసుకోగలిగింది. ఆమె చెయి చెప్పినట్టు వింటుందిప్పుడు కూర్చిక. ఇంచుమించుగా ఆమె చిత్రలేఖనంలో నళినాక్షుని స్థానాన్ని ఆక్రమించుకుంది అని చెప్పడంలో అతి శయోక్తి వుండదు. వర్ణ మిశ్రణంలో ఆమె ప్రత్యేక నేర్పు సంపాదించుకో గలిగింది. ఇప్పు డామె యే గీతగీసినా అదొక చిత్రంలా కనిపిస్తుంది. అందులో కళ వుట్టిపడుతుంది. అందరి స్త్రీలకంటే అధికంగా ప్రత్యేకంగా నళినాక్షుణ్ని ఆమె ఆక ర్షించడంచేత నళినాక్షుడు ఆమె నా స్థానానికి అతి సల్ప కాలంలో తీసుకురాగలిగాడు. ఆసంగతి వరూధిని గ్రహించక పోలేదు.

వరూధిని అందం వరూధినికి తెలుసో తెలియదో అది వేరేసంగతి. దేశ దేశాలు తిరిగి చిట్టచివరకు అమరకాంత

లంకరిలో తనే తన శిల్పానికి తగిన అంగసౌష్టవం గలిగిన వ్యక్తి అని ముసలి శిల్పి తనను తీసుకువచ్చిన విషయం ఆమెకు తెలుసు. తన ప్రతి అవయవంలోనూ దాగివున్న యేదో వస్తువును పట్టుకోవాలని వెతికే ఆ ముసలిశిల్పి కళ్ళను చూస్తూవుంటే ఆమె హృదయం పొంగిపోయేది ఆనందంతో.

మొదటి రోజుల్లో యీ ఆత్రాన్నే ఆమె నళినాక్షుని కన్నులలో గుర్తించింది. ఆ చూపుగల మరొక వ్యక్తిని గూడా తను ఆకర్షించ గలిగిందని ఆమె గర్వపడింది. ఆ చూపులో వికారం గలిగించే నైజం లేదు. పసిపాప తడుముచున్న ట్టనిపించేది. స్త్రీ పురుష భేదాన్ని పాటించ వలసిన అవసరం ఆ చూపు కలిగించేదిగాదు. అది కళాదృష్టి. అదే యోగదృష్టి. సృష్టిలోని సౌందర్యాన్ని మాత్రమే గ్రహించే దృష్టి, వూహకు అతీతమైన సౌందర్యాన్ని పట్టుకో డానికి ప్రయత్నించే దృష్టి అది. అది పర్యవసానంగా ఆనందాన్ని పొందుతుంది. దాన్నే శిల్పిలో చూచింది వరూధిని . నళినాక్షునిలో కూడా చూచింది.

శిల్పి దృష్టి మారిపోలేదు. అతడి ముందు నగ్నంగా నిలిచినా అతనికిగానీ తనకుగానీ యేవిధమైన వికారం కలిగేది గాదు. అప్పటికీ యిప్పటికీ యెప్పటికీ అంతే.

నళినాక్షుని దృష్టి మారిపోతూ వచ్చింది. మొదటి రోజుల్లో యేమీలేదు. తను యెంతో కులాసాగా అతని దగ్గర పాఠం నేర్చుకునేది.

ఇప్పుడతని ముందు కూర్చోడానికి ఆమెకు సంకోచం కలుగుతోంది. తలయెత్తి అతనితో మాట్లాడడానికి ఆమెకు జంకు కలుగుతోంది. అతడు తన కన్నులలోకి చూస్తూంటే తనకు సిగ్గుకలుగుతోంది.

ఈ చూపు వికారాన్ని కలిగిస్తోంది. తను స్త్రీ, అతడు పురుషుడు అని జ్ఞాపకం చేస్తోంది. ఇది కాముకదృష్టి. దీనికి సృష్టిలోని వస్తువుల సౌందర్యాన్ని పీల్చి పిప్పిచేయగల శక్తి వుంది. ఇది యోగదృష్టికి భిన్నమైనది. పర్యవసానంగా దుఃఖాన్ని అనుభవిస్తుంది.

ఇటువంటి అతని దృష్టికి తాను గురికాకూడదని ఆమె అందుకు తగిన జాగ్రత్తలన్నీ పడింది. తన కతడు విద్యనేర్పిన గురువు. తన చెల్లెలు అతణ్ణి వలచి మనువయింది.

ఆమె చిత్రలేఖనం పూర్తిగా నేర్చుకునేవరకూ అతని యెదుటికి వెళ్ళకుండా వుండడం కష్టసాధ్యమైనపని. అతడిలో కనిపిస్తూవున్న మార్పుని అతనికి యెత్తి చూపింది. రెండు మూడుసార్లు అతడు విన్నాడో లేదో.

తను యెంతో జాగ్రత్తగా పువ్వు సాదృశ్యంగా కాపాడుకుంటూ వస్తూన్న తన శరీరాన్ని నిర్దయతో నలిపి పారేస్తాడని ఆమె భయపడింది.

నళినాక్షుని యింటికి వెళ్ళకూడ దనుకుంది. పది రోజులనుండి వెళ్ళడం మానుకుంది కూడాను. ఇంటిదగ్గరే వుండిపోతోంది. ఒంటరిగా వుండిపోతోంది. తనకు తోచిన

చిత్రాలు గీసుకుంటూ కాలం గడుపుతోంది. శిల్పి దగ్గర లేకపోవడం ఆమెను మళ్ళీ బాధపెట్టింది. అతడు శీఘ్రంగా తిరిగివస్తే బాగుండును.

చెప్పకుండా నళినాక్షుని యింటికి వెళ్ళడం మానుకుంటే అత డేమంటాడో, యేమనుకుంటాడో! తన చెల్లెలు శ్రీలేఖ యెంత విచారపడుతుందో అని వరూధిని మనస్సు వున్నచోట లేకుండా అల్లాడింది. ఒకసారి వెళ్ళి చూచిరావాలనిపించింది.

కాని ఆమె వెళ్ళలేదు. వెళ్ళకూడదని తీర్మానించుకుంది. వెళ్ళకుండా వుండడమే ఉభయులకూ క్షేమకరమని నిశ్చయించుకుంది.

వరూధిని మనస్సు మాత్రం వ్యధపడుతోంది. ఎత్తుగా ఆకాశంలోకి చొచ్చుకు పోయిన హిమగిరి శిఖరాలను వాతాయనంలోంచి చూస్తూ నిలబడింది.

"వ రూ ధి నీ!" యెవరో దీనంగా భిక్షుకునిలా పిలిచారు.

వరూధిని వెనుకకు తిరిగి చూచింది.

నళినాక్షుడు వచ్చాడు. అతని వదన సరోజం వాడి వుంది. అతని కన్నులలో దైన్యం వుంది. నిద్రలేమితనం గోచరిస్తోంది. దేహంలో శుష్కత్వం కనబడుతోంది. అతడు యాచకునిలా చూస్తూ నిలబడ్డాడు.

"వచ్చారా– నాకోసం వచ్చారా–రండి, కూర్చోండి" అంది సంభ్రమాన్ని కనుపరుస్తూ.

నళినాక్షుడు కూర్చోలేదు.

"వరూధినీ — ఇన్ని రోజులు...... " అని ఆగాడు అర్థోక్తిలో. వరూధిని అతని మాటల వెనుక దాగివున్న భావాన్ని గ్రహించింది. ఆమె నెరజాణ.

"క్షమించండి, ఇన్ని రోజులు మీయింటికి రాలేక పోయాను. యేవేవో పనులు నా రాకకు అడ్డుతగిలినవి. రేపటినుండి మళ్ళీవస్తూవుంటాను—" అంది.

"నా బాధ నీవు గ్రహించ లేదా వరూధినీ—?"

వరూధిని అతనివంక చూడలేకపోయింది. ఆమె కన్నుల నీరుతిరిగింది. "గ్రహించాను- గ్రహించాను- మీరు యిక్కడనుండి వెళ్ళిపొండి" అంది ముఖాన్ని రెండు చేతులతో కప్పుకుంటూ.

"నన్నెందు కిట్లా వ్యధపెడతావు వరూ!" అన్నాడు ఆమెను సమీపించే వుద్దేశంతో రెండడుగులు ముందుకువేస్తూ.

"మీరే బాధను కోరి తెచ్చుకుంటున్నారు. నేనేమీ చేయడంలేదు" అంది రెండడుగులు వెనుకకువేస్తూ.

"వెన్నెలవంటి చల్లని నీ క్రీగంటి చూపులకోసం— నీ అధరామృతాని కోసం......" అంటూ ఆమెను సమీపించ బోయాడు.

వరూధిని వినలేకపోయింది. చేతులతో చెవులను కప్పుకుంది.

"శ్రీరేఖ మిమ్మల్నే నమ్ముకొనివుంది. మీ యీ పరివర్తన దాని జీవితాన్ని కలచేస్తుంది. దాని దుఃఖం నేను చూడలేను_" అంది గద్గదికంగా.

"నీకు నాతో వునికి శ్రీరేఖకు అభ్యంతరం వుండదు వరూ!" అన్నాడు. ఆ మాటలవుచ్చారణలో కామోద్రేకం స్ఫుటంగా గోచరిస్తోంది.

"చిత్రలేఖనం నేర్పి నాకు గురుత్వం వహించారు. గురువు తండ్రితో సమానమైనవాడు-" అంది దూరంగా తొలగిపోతూ.

నళినాక్షునికి ఈటెదెబ్బ తిన్నట్టనిపించింది. వికటంగా నవ్వాడు.

"తండ్రి – తండ్రి – వేశ్యా కులానికి వావివరుసలు!" మళ్ళీ ప్రతిధ్వనిపుట్టేట్లు నవ్వాడు. వరూధినికి వొళ్ళుమండింది.

"కులానికి లేకపోవచ్చు. వ్యక్తిగతంగా నీతినియమాలు పాటించవచ్చునుగదా" అంది.

"వరూధినీ!" అన్నాడు ఆమెను సమీపించి ఆమె హస్తాన్ని గట్టిగా పట్టుకుంటూ.

"నళినాక్షా——!" అని గట్టిగా అరిచింది. అంతకంటే గట్టిగా అరవలేకపోయింది. ఆమె ముఖం జేవురించింది. నళినాక్షుడు ఆమెను తన కౌగిట్లోకి లాక్కోడానికి ప్రయత్నించాడు.

"వరూధినీ! యింక ఆలస్యం చేయకు!" అంటున్నాడు. అతనికి వొక బలమైన చెంపపెట్టు తగిలింది. వరూధిని తన సత్తువకొద్దీ కొట్టింది. అతడు ఆమె చేతిని వదిలిపెట్టాడు.

వరూధిని యింక అక్కడ నిలవలేకపోయింది. సమీపంలోవున్న మంచంమీద బోర్లపడి వెక్కివెక్కి యేడ్చింది. కొట్టిన ఆమె చేయి వణుకుతూనేవుంది.

"మానరక్షణకోసం శిష్యురాలి మర్యాదను వదిలి కొట్టాను, క్షమించండి" అంటూ లేచి వెనుకకు తిరిగి చూచింది.

నళినాక్షుడు లేడు. అతడు వెళ్ళిపోయాడు. ద్వారం వరకూ పరుగెత్తుకుంటూ వచ్చి చూచింది. "నళినాక్షా —!" అని గట్టిగా పిలిచింది. అతడు తిరిగి చూడకుండా వెళ్ళిపోతున్నాడు.

వరూధిని పెద్దగా వొక నిట్టూర్పు విడిచింది.

# 12

శ్రీలేఖ కొద్దిరోజులనుండి నళినాక్షున్ని కనిపెడుతూ వస్తోంది. రోజురోజుకు భర్తలో కనిపిస్తూవున్న మార్పు, నిస్తరంగ సాగరంలాగావున్న ఆమె హృదయాన్ని ప్రళయాంబోధినిగా తయారుచేసింది.

ఇప్పు డతడు తనతో మాట్లాడడంకూడా మానుకున్నాడు. ఎందుకో కారణం ఆమెకు అనూహ్యమైంది.

తను నళినాక్షుణ్ణి తృప్తిపరచడంలో, అతనికి పరిచర్య చేయడంలో యేదైనా లోపముందేమోనని ఆమె సందేహ పడింది. తను అతణ్ణి చూచిన దాదిగా నేటివరకూ అతనితో గడపిన రోజులన్నీ జ్ఞాపకానికి తెచ్చుకుని చూచింది. తను యెరిగివుండీ అతణ్ణి యీ పరిస్థితికి తీసుకువచ్చే తప్పేమీ చేయలేదు. తన కతనిమీద యెంత ప్రేమవుందో అంతకంటే అధికమైన ప్రేమ అతడు తనమీద చూపేవాడు. శచీపతి మిమ్మల్నే బహుమానం కోరుకోమంటే యేమి కోరుతారు? అని అడిగితే తన్ను కౌగిట్లోకి తీసుకుని "నిన్ను" అని పలికిన ఆనాటి అమరావతిలోని మాట ఆమెకు జ్ఞాపకానికి వచ్చింది. తనమీద యెంత ప్రేమలేకపోతే ఆ మాట అంటాడు?

ఇప్పుడు నళినాక్షునికి తనమీదే తనకు శ్రద్ధ తప్పు తుండడం ఆమె గమనించింది.

రాత్రింబవళ్ళు మధువుమాత్రం తాగుతాడు. మరేమీ తినడు. పండ్లుకూడా ముట్టుకోడు. రోజుకురోజూ పిచ్చివాడిలా అయిపోతున్నాడు.

అతని వాలకం శ్రీలేఖ చూడలేకపోయింది. అతని మనసు యెట్లాగైనా మార్చాలని ప్రయత్నించింది. కొద్ది రోజులుగా అతడు తన దగ్గర పడుకోడంలేదు. దూరంగా వేరే పండుకుంటున్నాడు. ఆ రాత్రి ఆమె కావాలని అతడి దగ్గర పడుకున్నది. అత డేమీ అనలేదు. పక్కకు తిరిగి పడు కున్నాడు. శ్రీలేఖ యెన్నో ప్రశ్నలు వేసింది. అతడు దేనికీ

సమాధానంగా "ఊ" "ఆఁ" అనికూడా పలుకలేదు. కొంత సేపటికి నిద్రపోయాడు.

శ్రీలేఖకు కూడా కునుకు పట్టింది. కాని ఆమెకు యెంత శీఘ్రంగా నిద్రపట్టిందో అంత తొందరగా మెలకువకూడా వచ్చింది. కారణం? నళినాక్షుడు కలవరిస్తున్నాడు. "నన్నెందుకిట్లా వ్యధపెడుతావు వరూధినీ!" శ్రీలేఖ తన చెవులను తానే నమ్మలేక పోయింది.

"నీకు నాతో వునికి శ్రీలేఖకు అభ్యంతరం వుండదు వరూ!"

తన అక్కను నళినాక్షుడు కోరుతున్నాడా! అతడు ఆమె సౌందర్యాన్ని మెచ్చుకోడం కళాదృష్టితోనని తను యిన్ని రోజులూ అనుకుంటున్నదల్లా వట్టి భ్రమేనా? తన అక్క యిన్నిరోజులనుండి తనయింటికి రాకపోవడం యెందుకో ననుకుంది. నళినాక్షుడు ఆమెను బలాత్కరించాడా?

"ఇంక ఆలస్యం – చేయకు వరూధినీ–" నళినాక్షుడు మళ్ళీ కలవరించాడు. శ్రీలేఖ యింక వినలేక పోయింది. అతనిమీద చెయ్యివేసి మెల్లిగా లేపింది. నళినాక్షుడు కన్నులు తెరిచి మళ్ళీ మూసుకుని పడుకున్నాడు.

తెల్లవారి శ్రీలేఖ అతని దగ్గరకు వచ్చింది. రాత్రి నిద్రలేక ఆమె కండ్లు యెఱ్ఱబారినై. నళినాక్షుడు మౌనంగా కూర్చుని ఆలోచిస్తున్నాడు.

"మీరు రాత్రి కలవరించారు" అంది గద్గదికంగా

"... ... ..."

"వరూధిని మీకు చెల్లెలితో సమానమైంది." అంది మళ్ళీ. అతడేమీ మాట్లాడలేదు. ప్రక్కకుతిరిగి కూర్చున్నాడు శ్రీలేఖకు ఏడుపు వచ్చేసింది. అక్కడ వొక్కక్షణం నిలువ లేకపోయింది. లోపలికి వెళ్ళిపోయింది.

నళినాక్షుడు ఇంకా ఆలోచిస్తూనే కూర్చున్నాడు. చాలాసేపు కూర్చున్నాడు. ఎంతసేపు కూర్చున్నాడో అతనికి తెలియదు.

"లోపలికి రావచ్చా?" ఒక అపూర్వమైన వీణా నాదం లాంటి కంఠస్వరం వినిపించింది.

నళినాక్షుడు వినిపించుకోలేదు. మళ్ళీ అవే తియ్యని మాటలు వినిపించినవి. అతడు వెనుదిరిగి చూచాడు. అతడికి చైతన్యం వచ్చింది. ఉన్మాదస్థితి కొంత తగ్గింది. అతనికి ఆశ్చర్యం కలిగింది.

కన్నులను మిరిమిట్లుగొలిపే శరీరకాంతితో, నవవికసిత వసంత కుసుమంలా చిరునవ్వు నవ్వుతూ ద్వారం దగ్గర మన్మధుని అర్థాంగి రతీదేవి నిలబడివుంది.

"సౌందర్యాధిదేవతకు స్వాగతం!" అన్నాడు లేచి నిలబడి.

రతీదేవి "నా సౌందర్యం యింకా సార్థకం కాలేదోయీ" అంటూ రాజహంసలా లోపలికి నడిచివచ్చి కూర్చున్నది ఒక ఆసనంమీద.

"మీ వాగ్ధోరణి చిత్రంగావుంది!" అన్నాడు.

"చిత్రమేమీలేదు. నా సౌందర్యానికి సార్థక్యం నీ కూర్చికే యివ్వాలి" అంది. నళినాక్షుడు తనకు యేమీ అర్థంకానట్టు చూచాడు. రతీదేవి ముఖం చిరునవ్వువెన్నెలతో నిండుగా వికసించింది.

"పేశలమైన మీ శరీరలతను క్షోభపెట్టి నా యింటి వరకూవచ్చిన కారణం తెలుసుకోవచ్చా?" అని అడిగాడు సవినయంగా.

"నే నిప్పుడు అమరావతినుండి వస్తున్నానోయీ. అక్కడ నీవు చిత్రించిన పులోమజ చిత్రాన్ని చూసి, నీకు నా మనఃపూర్వకమైన అభివందనాలు అర్పించకుండా యింటికివెళ్ళలేక యిటువచ్చాను." అంది అతన్నివైపుచూస్తూ.

"ధన్యుణ్ణి మాతా!" అన్నాడు.

"నీవు మా యింటి కొకసారి రావాలోయీ. నా భంగిమలు కూడా కొన్ని నీ చేతులారా చిత్రించాలి. అప్పటికి గాని నాకు తృప్తివుండదు." అంది లేచి ఆ గదిలో వున్న చిత్రాలన్నీ ఒక్కొక్కటే పరిశీలించిచూస్తూ. నళి నాక్షుడు ఆమెను అనుసరించి తిరుగుతున్నాడు.

"ఏమంటావు నళినాక్షా?" అంది మళ్ళీ.

"నేను మీ దాసుణ్ణి. మీ ఆజ్ఞను వుల్లంఘించలేను— కాని — కాని" అని ఆగాడు. అతని కంఠం రుద్ధమైంది. ఇంక చెప్పలేకపోయాడు.

"ఏదో సందేహిస్తున్నావోయీ. మనసులోవున్నది చెప్పు" అంది.

"నా మనస్సు తిన్నగాలేదు తల్లీ!" అన్నాడు.

"నీ హృదయాన్ని కష్టపెడుతున్న దెవరూ?" అంది.

"మీ భర్తగారు......" అన్నాడు.

రతీదేవి నవ్వింది. "ఇప్పుడు నాభర్త నీమీద బాణ ప్రయోగం సాధిస్తున్నారా? యేవనిత కారణంగా విరహ వేధన ననుభవిస్తున్నావోయీ?" అంది.

నళినాక్షుడు అక్కడ గోడకు వ్రేళ్ళాడుతున్న ఒక తెరను తొలగించాడు. వరూధిని చిత్రిం ప్రత్యక్షమైంది.

"వరూధినా?" అని అడిగింది.

నళినాక్షుడు తలవంచుకున్నాడు. "ఆమె నిన్ను వరించ లేదా?" అంది. నళినాక్షుడు యేమీ మాట్లాడలేదు. రతీదేవికి అతనిమీద జాలికలిగింది.

"నీకోరిక ఫలించేటట్టు చేస్తానోయీ, భయపడకు" అంది.

"మీ భర్తగారితో చెబుతారా?" అన్నాడు.

రతీదేవి గర్వంతో తలపంకించింది. 'నా భర్త సాధించేది నీకోసం నేనే చేస్తాను. నేను వరూధినితో చెబుతాను. ఆమెను అంగీకరింపజేస్తాను. ప్రతిఫలంగా నీవు మాయింటికి రావాలి." అంది.

నళినాక్షునిమీద అమృతవర్షం కురిసినట్టయింది.

"మీమేలు నేను యెన్నటికీ మరిచిపోను" అన్నాడు ఆమెకు మొకరిల్లి.

"నేను వెళ్ళి వస్తానోయీ" అంటూ బయటకు నడిచింది రతీదేవి. నళినాక్షుడు ఆమెను ద్వారంవరకూ సాగనంపాడు.

# 13

గట్లు తెంచుకుని వచ్చిన దుఃఖప్రవాహవేగానికి భర్త యెదుట నిలువలేక లోపలికొచ్చిన శ్రీలేఖ శయ్యమీదపడి చాలాసేపు యేడ్చింది.

నళినాక్షుడు యిప్పుడు తన అక్క వరూధినిని కోరుతున్నాడు. తనఅక్క కేవలం కళారాధకులకోసం సృష్టింపబడ్డదా అన్నట్టు వున్న తన అక్క నళినాక్షునిలో కామ వాంఛను రేకెత్తించింది. ఇప్పుడు తనగతి యేంగావాలి?

నళినాక్షునివంటి సుందరుడైన పురుషుణ్ణి తాను యింత వరకు చూడలేదు. బహుశః తనఅక్కకూడా చూచివుండదు. తనకులాగే వరూధినికికూడా మోహం కలిగితే? వరూధిని అంగీకరిస్తుందా? తనకు సవతిగా వస్తుందా? ఆమె మనస్సు పరిపరివిధాలా పరుగెత్తింది.

"నీకు నాతో వునికి శ్రీలేఖకు అభ్యంతరం వుండదు వరూ—" రాత్రి నళినాక్షుడు కలవరించిన మాటలు జ్ఞాపకానికి వచ్చాయి.

నళినాక్షుడు తన అక్కను బలాత్కరించాడు. ఆమె అంగీకరించలేదు. తనమీద వరూధినికి యెంతప్రేమ!

వరూధిని తనయింటికి వచ్చి చాలా రోజులైంది. కారణం యిన్ని రోజులూ తెలియలేదు. ఇప్పుడు బాగా అర్థమైంది. వరూధినిని చూడాలనిపించిం దామెకు. ఆమెను కౌగలించుకుని యేడవాలనిపించింది. ఆయింట్లో వొక్కక్షణం నిలువలేకపోయింది. వెంటనే బయలుదేరింది.

శ్రీలేఖ వచ్చేటప్పటికి వరూధిని అంగణంలోవున్న ద్రాక్షపందిరిదగ్గర నిలబడి తడిగావున్న తలవెంట్రుకలను ఆరబోసుకుంటోంది. కట్టిన తెల్లని పావడ దానిపైనవేసిన తెల్లని పమిట, నిరాభరణత్వం ఆమె కొక వింత అందాన్ని చేకూర్చింది.

"అక్కా!" అంటూ పరుగెత్తుకుంటూ వచ్చి వరూధినిని కౌగలించుకుని పసిబిడ్డలా బావురుమంది శ్రీలేఖ.

"నాకు తెలుసు నువ్విట్లా యేడుస్తూ వస్తావని" అంది వరూధిని తన తెల్లనిపమిటతో శ్రీలేఖ కాటుకకన్నీళ్ళు తుడుస్తూ. శ్రీలేఖ వెక్కుతూనే అక్కవంక చూచింది. రాత్రి నళినాక్షుడు కలవరించిందంతా చెప్పింది. "అతడు నిన్ను బలాత్కరించాడా అక్కా?" అంది.

నిజంచెప్పి తనచెల్లెలి లేతగుండెను పగులగొట్టడం వరూధినికి యిష్టంలేదు.

"వెఱ్ఱిదానా! అత డట్లాంటివాడు కాదు." అంది.

"మరి అట్లా పిచ్చివాడిలా ప్రవర్తించడంలో అర్థమేమిటి" అంది శ్రీలేఖ.

"కళారాధకుల మనస్తత్వం నీకు అర్థంకాదు.

"నాకు నమ్మకంలేదు. నువ్వెందుకు మా యింటికి రావడం మానుకున్నావు?"

'మానుకోవడమేమిటీ. తీరికలేక రావడంలేదు. అంతే-'

"అంతేనా—!" వరూధిని మాటలు తనకు కొంత వూరడింపు కలిగించినా, శ్రీలేఖ హృదయంలో భారం మాత్రం తగ్గలేదు. గిరుక్కున వెనుకకుతిరిగి యింటిముఖం పట్టింది.

"ఇంతదూరం వచ్చావు, ఈపూట యిక్కడే వుండిపో" అని కేకవేసింది వరూధిని. శ్రీలేఖ వినిపించుకోలేదు. అట్లాగే వెళ్ళిపోయింది. వరూధిని పెద్దగా ఒక వూర్పువిడిచింది. తలవెంట్రుకలు ముడివేసుకుని లోపలికి వెళ్ళబోతూ వుంటే వెనుకనుండి యెవరో పిలిచారు. ఆమె వెనుకకు తిరిగిచూచింది. రతీదేవి దంతపు మొగలిరేకను విలాసంగా చేతితో పట్టుకుని ద్రాక్షపందిరి దగ్గర నిలబడివుంది.

"రతీ...!" అంది ఆశ్చర్యంతో "నా తపస్సు ఫలించింది" అంది వరూధిని ఆమె రెండుచేతులూ పట్టుకుని లోపలికి తీసుకువెడుతూ.

"తపస్సా- నన్నుగూర్చేనేమిటి" అని అడిగింది రతి.

"తపస్సు అంటే తదేక దీక్షతోచేసే ఆలోచన. నీరూపం యెట్లావుంటుందా అని నేను చేస్తూన్న ఆలోచనకు నీవు సాక్షాత్కరించావు."

'నన్నిదివరకు చూడలేదాయేమి? అంది నవ్వుతూ రతి.'

"చూశాను. కాని, నీ రూపురేఖలకోసం చాలా ఆలో

చించవలసివచ్చింది. నీ పరోక్షంలో నే నొక కార్యం తల పెట్టాను. అది పూర్తిఅయిన తరువాత నీదగ్గరికి రావాలను కున్నాను.”

“ఏమి టా కార్యం?”

“ఊహతో నే నీ స్వరూపం చిత్రించాలనుకున్నాను. అది యెంతవరకు సఫలమైందో నీవే చెప్పాలి.” అని వొక చిత్రపటాన్ని చూపింది రతికి. అది రతీదేవి చిత్రమే. వరూధిని చిత్రించింది. అందులో రతి మూర్ఛపడివుంది. శివుని కోపాగ్నికి దగ్ధుడైన మన్మధుని భస్మరాశి వొకచోట పడివుంది. చుట్టూవున్న ప్రదేశమంతా దీనతను సూచిస్తోంది. అతినేర్పుతో చిత్రించబడిఉంది.

“ఆనాడు నిన్నుచూచిన అనుభవం యీనాడు ప్రతి బింబీకృతమైంది” అంది వరూధిని. రతీదేవి కళ్ళల్లో నీళ్ళు తిరిగినై. ‘ఈ చిత్రం నీకు సంతోషాన్ని కలిగిస్తోందా వరూ?’ అంది రతి.

“చిత్రం తప్పకుండా సంతోషాన్నే కలిగిస్తుంది. ప్రత్యక్ష సంగతి వేరు. యుద్ధం భయంకరం కావొచ్చు. దానికథ వినడానికి యింపుగా వుండదా?” అంది వరూధిని రతీదేవి యేమీ మాట్లాడలేదు కొంతసేపు.

“చిత్రలేఖనం బాగా నేర్చుకున్నా విప్పుడు!” అంది చిత్రాన్ని పరిశీలించిచూస్తూ.

“చిత్రలేఖనంలో న న్నింతదాన్ని చేసింది నళినాక్షుడు అంది వరూధిని.

"తెలుసు—" అంది రతి.

"నీకు తెలియదని యెవరన్నారు. నీవు మనోభవుని భార్యవు"

"నే నిప్పుడు అతనిదగ్గరనుండే వస్తున్నాను. అతడు నీకోసం పరితపిస్తున్నాడు."

"నీవు రాయభారానికి వచ్చావా?" అంది వరూధిని నవ్వుతూ.

"అతని దైన్యం నేను చూడలేక పోయాను—"

"అది నీ భర్తగారి లీల. నీ భర్తగారితో చెప్పి నివారణ చేయించు"

"నీవు తలచుకుంటే నాభర్తదాకా వెళ్ళనక్కరలేదు"

"రతీ—!" గట్టిగా అంది వరూధిని.

"అతనికి యేంలోపం వుందని నీవతణ్ణి నిరాకరించావు వరూ?"

"రతీ! అతనితోపాటు నీవుకూడా నన్నర్థం చేసుకోలేదు. అతడు నాకు గురువు. నాచెల్లెలు అతణ్ణి వలచి పెళ్ళాడింది—" అంది కన్నీళ్ళు కారుతూన్న కళ్ళతో.

"చెల్లెతోపాటు నీవుకూడా అతనితో వుండలేవా? భర్తదగ్గర విద్యనేర్చుకున్న వారెవరూ లేరా? గురువు తండ్రితో సమానమైనవాడని వారంతా భర్తల్ని వదిలేస్తున్నారా. నీదంతా విచిత్రం!"

"ఈరీతిగా మాట్లాడ్డం తోటి ఆడుదానికి తగదు రతీ"

"నీ మనసు మార్చుకోలేవా వరూ ?"

"నీ భర్త కూడా నా మనస్సును అతనిమీదకు మళ్ళించలేడు" అంది వరూధిని. ఆమె హృదయంలోని దృఢత్వం ముఖంలో గోచరించింది. రతీదేవికి యీ మాటతో పోడిచినట్టయింది.

"నా భర్తకూడా నిన్ను మార్చలేడా ?" అంది రతి.

"మార్చలేడు రతీ ! నా నిశ్చయాన్ని యెవ్వరూ మార్చలేరు. నీకు అతనిమీద అంత అభిమానంవుంటే, నీభర్తతో చెప్పి, అతని హృదయాన్నే మార్చడానికి చూడు. నాకూ, అతనికీ వుపకారం చేసినదానవవుతావు. నేను చిత్ర లేఖనంలో అతనిదగ్గర నేర్చుకోవలసినది చాలావుంది." అంది వరూధిని.

రతికి యింక అక్కడ కూర్చోడానికి మనస్కరించ లేదు.

"నేను వెడుతా" అంటూ లేచింది.

"నామీద కోపం వచ్చిందా రతీ ? నీవు న్యాయం ఆలోచించు" అంది వరూధిని. రతి యేమీ మాట్లాడలేదు. తిన్నగా బయటకు నడిచింది. వరూధిని ఆమెను ఆపడానికి ప్రయత్నించలేదు. రతి వెళ్ళిపోయింది. వరూధిని ఆమె వెళ్ళిన దారివంకనే చూస్తూ నిలబడిపోయింది ఆలోచిస్తూ.

# 14

వరూధిని దగ్గరనుండి యింటికి వచ్చిన రతీదేవి తాను పరాభవింపబడ్డా ననుకుంది. హృదయంలో చాలా మధన పడింది. వరూధినియొక్క ధృఢనిశ్చయం ఆమెకు ఆశ్చర్యాన్ని కలిగించింది. కాని నళినాక్షునికి తను మాట యిచ్చింది. తనశక్తి తాను చూచుకోకుండానే అతనికి మాటయిచ్చింది. అతని మనస్సుకు సంతోషాన్ని కలిగించి, అతనిచేత తన చిత్రాలను గీయించుకోవలెననుకుంది. రతికి చిత్రకళ అంటే చాలా ప్రీతి. తన సౌందర్యంమీద అభిమానం యెక్కువ. భర్త సాధించేపని తానే సాధించాలనుకుంది. ఫలించలేదు. నళినాక్షుడు యేమనుకుంటాడో!

అబ్బ! వరూధినికి యెంత పట్టుదల. యెన్ని నీతులు మాట్లాడుతుంది! వారాంగనకు యెన్ని నియమాలు! తన సౌందర్యానికి అతడు తగడా?

రతి ఆలోచిస్తూ కూర్చుంది. నళినాక్షునికి తానేవిధంగా వుపకారం చేయగలదు? అతని చిత్రాలు తనకు నచ్చడం అతనిమీద తనకు యెటువంటి అభిమానాన్ని పుట్టిస్తోంది. ఆమె మనస్సు పరిపరి విధాల పరుగెడుతోంది.

"నీ భర్తకూడా నా మనస్సును అతనిపైకి మళ్ళించ లేదు" అన్న వరూధిని మాటలు ఆమె చెవుల్లో గింగురు మంటూనే వున్నవి.

ఛీ! ఛీ!! పరాభవం! పరాభవం!! అంది గట్టిగా.

"పరాభవమా? యెవరికీ?" యెవరో అడిగారు. రతి వెనుకకు తిరిగి చూచింది. మన్మథుడు వచ్చాడు. పూల ధనస్సు ఓమూల చేర్చి వచ్చి ఆమెపక్కన కూర్చున్నాడు.

"ఇంకెవరికీ, నాకే" అంది మూతితిప్పుకుంటూ రతి.

మన్మథుడు పకపక నవ్వాడు. "నీవు పెత్తనం చేయ బోతే యిల్లాగే వుంటుంది." అన్నాడు. తనకేమీ అర్థం కానట్లు అతనివైపు చూసింది రతి.

"నన్ను పరాభవించాలని చూశావు నువ్వు—" అన్నాడు మళ్ళీ మన్మథుడు.

"నేనేంజేశాను—?" కండ్లు పెద్దవిచేసి అతనివైపు చూసింది.

"నా సహాయం లేకుండానే విముఖమైన హృదయాన్ని సుముఖం చేయడానికి ప్రయత్నించావు— నన్ను చులకన చేశావు— తగిన శిక్ష" అన్నాడు.

"మీరు సర్వాంతర్యాములు"

"తెలిసివుండి కూడా—"

'నళినాక్షుణ్ణి మీరు యెందు కట్లా తపింపజేస్తున్నారు?'

మన్మథుడు మళ్ళీ నవ్వాడు.

"నేను కావాలని యెవర్నీ తపింపజేయను. నాకంటే పెద్దవాడు "కాలం" వున్నాడు. అతని ఆజ్ఞ. ఆ ఆజ్ఞను నేను శిరసావహించక తప్పదు. ఒకరు తపించడం, తపించక పోవడం కాలనియమాన్ని బట్టి వుంటుంది" అన్నాడు.

నా అర్ధాంగివైన నీకు యీమాత్రం తెలియదా అన్నట్లు ఆమెవైపు చూసాడు.

"వరూధిని హృదయాన్ని నళినాక్షునివైపు మరలించడానికి మీకు శక్తి చాలదా?" అంది రతి.

"నాకు కాలం ఆజ్ఞ లేదు. వరూధిని అతణ్ణి వరించదు కూడాను"

"ఎందుకని? అతని కేమి లోపంవచ్చింది?"

"వరూధిని నీకంటే సౌందర్యవతి — ఆసంగతి నీవు అంగీకరిస్తావా?"

రతికి రోషంవచ్చింది. అయినా దాన్ని వెలిగక్కలేదు.

"కావొచ్చు— కానీ—"

"నళినాక్షుడు నాకంటే సుందరుడైనవాడు అనబోతావేమో! కాడు. వరూధినికి అతడు తగడు."

"మరి ఆమెకు తగినవాడు—"

"ఉన్నాడు. నా సౌందర్యం చంద్రుని సౌందర్యం కలిపి పోత పోస్తే రూపందినవా డతడు. చదువులో శేషుని వెక్కిరిస్తాడు. అతన్నిగాని వరూధిని వరించదు."

"అటువంటి పురుషుడుకూడా వున్నాడా? ఎవడాతడు?"

"ఏం, నీ కతని మీద మనస్సు పోతోందా?"

"ఛీ! ఏమి టా మాటలు—"

"ఏమో! కాలం యెట్లావుందో! నీమీదే బాణ ప్రయోగం సాగించవలసివస్తే—"

"చాల్లెండి. మీ దంతా విచిత్రం — ఇంతకూ యెవ రాతను ?"

"నిండు యౌవనంలోవున్న వొక బ్రాహ్మణుడు. వరుణానదీ తీరంలోవున్న అరుణాస్పద పురంలో వుంటాడు. తల్లీ, తండ్రీ, పాడీ—పంటా యోగం, భోగం, అన్నపూర్ణ లాగా విసుగూ, విరామం లేకుండా వచ్చినవాళ్ళకు వండి పెట్టే భార్యా— వొకటేమిటి, అత డనుభవించే సుఖం నువ్వూ నేనూకూడా అనుభవించం."

రతీదేవి నవ్వింది. "అంత సుఖం అనుభవిస్తున్న వాడు వరూధిని దగ్గరకు యెందుకు వస్తాడు ? పరస్త్రీలోలుడు కూడానా ?"

"ఆమాట అనకు, కళ్ళు పోతాయి. తన్ను వరించే జారస్త్రీలకు ఆడు తుమ్మెదలకు సంపంగిపూవులాంటివాడు."

"మరి వరూధిని అతణ్ణి—"

"అవును, కోరుతుంది—"

"అరుణాస్పదపుర మెక్కడ, హిమగిరి లోయలో వున్న వరూధిని యెక్కడ ; వీరిద్దరూ కలవడమా ? మీరు కథలు చెబుతారు."

"అంతా కాలంయొక్క ఆజ్ఞ. అతడు తీర్థయాత్రా ప్రియుడు."

"తీర్థయాత్ర చేస్తూ హిమగిరికి వచ్చినప్పుడు మీరు వారిద్దరినీ కలుపుతారా ?"

"అదంతా నీ కనవసరం. నాకు పేపైంది, నేను వెడుతాను." అని లేచాడు.

"ఆ బ్రాహ్మణుడు జితేంద్రియుడన్నావు?" రతీదేవి కంఠంలో యేదో భయం గోచరించింది.

"అవుతే నేం—?"

"మీ రతనిమీద బాణప్రయోగం చేస్తే–"

"శివుడిలా నన్ను భస్మం చేస్తాడనా?"

రతి గట్టిగా చెవులు మూసుకుంది. ఆమె కళ్ళల్లో నీళ్ళు తిరిగినై.

"పిచ్చిదానా! నాచేతిలో యేముంది? నేను కాలం చెప్పినట్టు వినాలి. యేది వచ్చినా అనుభవించాలి. ఇందుకు విచారిస్తే అవుతుందా. నేను వెడుతా – వరూధినికి ఆ బ్రాహ్మణ యువకుణ్ణి చూసే కాలం సమీపించింది."

"అతడు తీర్థయాత్రకు బయలు దేరాడా?"

"లేదు, నేను వెళ్ళి పంపాలి—" మన్మథుడు వెళ్ళి పోయాడు. రతీదేవి అట్లాగే చూస్తూ నిలబడి పోయింది." ఇంక యెన్ని రావాలో — 'కాలం' దాని ఆజ్ఞ యెవ్వరూ దాటలేరు." అంది వేడిగా దీర్ఘంగా నిట్టూర్పు విడుస్తూ. నళినాక్షునికి నేను యేవిధంగానూ సహాయ పడేట్టుగాలేను. నాకోరిక అతడుమాత్రం యెందుకు తీరుస్తాడు—"

రతీదేవి పరుపుమీదపరుండి చాలాసేపు ఆలోచించింది.

# 15

మన్మథుని వేషం చిత్రంగా తయారైంది. జేగురు రంగులోవున్న పొంటెజడను కప్పిన పులితోలు కిరీటం. జింక తోలు పట్టీ వడ్డాణం, యోగదండం, కమండలం, కాషాయి వస్త్రాలు, వొళ్ళంతా విభూతి, సాక్షాత్తు వొక జౌషధసిద్ధునిలా వొక బ్రాహ్మణ గృహంముందు నిలబడి "భవతి భిక్షాం దేహి" అంటున్నాడు. సూర్యుడు నడినెత్తికి వచ్చి తన తీక్ష్ణతనంతా చూపిస్తున్నాడు.

అది వరుణానదీ తీరంలోవున్న అరుణాస్పదంలోని వొక సౌధము. ఆకాశాన్ని ముద్దుపెట్టుకుంటున్నాయా అన్నట్టు వుంటవి ఆ పట్టణంలోని కోట గోడలు. ఆ మేడల సున్నపు తెలుపువన్నె చంద్రునిలోని మచ్చనుగూడా తెల్లగా చేసేస్తుం దనిపిస్తుంది. భూదేవి కంఠహారంలోని నాయకమణి ఆ పురం.

సిద్ధుని వేషంలోవున్న మన్మథుని కంఠం విని వొక బ్రాహ్మణ యువకుడు బయటకు వచ్చి అతనికాళ్ళు కడిగి లోపలికి తీసుకువెళ్ళాడు.

ఇదివరకు రతీదేవితో చెప్పిన బ్రాహ్మణ యువకుడే అతడు.

అతడు వరుణానదిలోని తామరలు సగంవికస్తూవుండగా నిద్రలేస్తాడు. లేచి శిష్యులతో నదికి వెడతాడు. వెళ్ళి

తుహినగిరి జ్ఞాపకం వచ్చిం దతనికి. అక్కడి వనం, సెలయేళ్ళు అతనికి చూడాలనిపించింది. మొదట తను అక్కడికే వెళ్ళాలి. అవును వెళ్ళితీరాలి. అతను నిశ్చయించుకున్నాడు. తక్కిన స్థలాలు తరువాత చూసుకోవచ్చు. నిద్ర పట్టి కొంత సేపటికల్లా లేచాడు. బాగా తెల్లవారిపోయింది.

తొందర తొందరగా స్నానాదికం ముగించి వచ్చి సిద్ధునికి నమస్కరించి నిలబడ్డాడు. సిద్ధుడు తన పేళ్ళు పెట్టె లోంచి వొక భరణి బయటకుతీసి, అందులోని వొక పసరు యిది అది అని చెప్పకుండా అతనికాళ్ళకు పూశాడు. ప్రవరుని కాలు నేలమీద లేదు. సిద్ధుడు నవ్వాడు. వికటంగా నవ్వాడు మన్మథుడై తనలో తాను నవ్వుకున్నాడు. "కాలం. నాచేత చిత్రమైన పనులు చేయిస్తున్నాడు." అనుకున్నాడు. తన దారిన తాను వెళ్ళిపోయాడు.

# 16

"హాఁ, భగవంతుడా! సిద్ధుని మిషతో నన్నీ ఘోర వనంలోకి తీసుకువచ్చావా? యింక యిల్లుచేరడ మేవిధంగా ప్రభూ?" అని ప్రవరుడు గట్టిగా అరిచాడు. ఆ కేక హిమగిరి గుహలలో ప్రతిధ్వనించింది.

అతనిహృదయం దడదడ కొట్టుకుంటోంది. మిట్టమధ్యాన్నపు యెండ తలను మాడ్చేస్తున్నది. పులుల పెడబొబ్బలు, యేనుగుల ఘీంకారములు, సింహగర్జనలు, ఖడ్గమృగముల

అరపులు ఆ ఘోరవనాన్ని కంపింప జేస్తున్నవి. అతని హృదయం భీతిల్లిపోయింది.

తను యీ ఘోరవనానికి యెందుకు రావాలి? ఆ మందు ప్రభావం తెలుసుకోడానికి తాను యీ భయంకర ప్రదేశానికే రావాలా? కాశీ, అవంతి, కురుక్షేత్రము, గయ, ప్రయాగ తీర్థయాత్రాస్థలాలు, జనులతో నిండిన ప్రదేశాలు లేవా?

తాను ఆకాశం మీాదనుంచి దిగుతోంటే యెంత సుందరంగా కనుపించిం దీ పర్వతం. కొండ చివరిభాగాలనుండి దొర్లి మృదంగనాదాలు చేస్తున్న సెలయేళ్ళ చప్పుళ్ళకు అనుకూలంగా పురులువిప్పి నాట్యమాడే నెమళ్ళు, తొండాలతో యేనుగులు కదిలిస్తూంటే వింతగా వూగే చెట్లూ! యెంత మనోహరంగా వుండినది. ఇప్పు డా మనోహరతంతా యెక్కడికి పోయింది? అప్పుడు తనహృదయం సంతోషంతో యెట్లా పొంగిపోయింది!

అనతికాలంలో తాను యెన్నిచోట్లు ఆ మందు ప్రభావంవల్ల చూడగలిగాడు? బదరీనారాయణం యెక్కడా! భగీరథుడు గంగకోసం తపస్సుచేసిన చోటెక్కడ! తలచుకోవడమే తరువాయిగా యిక్కడనుండి అక్కడికి వాలలేదా! ఇంక యెన్నెన్నిస్థలాలు! భూమి చీలిపోయేట్టుగా గంగ కిందికిదిగినచోటు, పార్వతి శివునికోసం తపస్సుచేసినచోటు, మన్మథుడు భస్మమైనచోటు, అగ్నిదేవుడు సప్తర్షిభార్యల

కోసం విరహమనుభవించినచోటు, కుమారస్వామి జన్మించిన శరవణం. ఒకచోటికి ఒకచోటికీ మధ్య యెంతదూరం! అన్నీ త్రుటికాలంలో చూడటానికి యెట్లా సాధ్యమౌతుంది ఆ మందు లేకపోతే!

అవన్నీ చూస్తూవుంటే ఆ మందు సహాయంతో తానక్కడికి వచ్చానన్న సంగతే జ్ఞాపకంలే దతనికి. చూస్తూవుంటే యింకా యింకా చూడాలనే అనిపిస్తోందతనికి. ఆ హిమగిరి మహిమ వర్ణించడానికి బ్రహ్మకైనా తరమవుతుందా?

ప్రళయాగ్నికి భస్మమైన భూమి మళ్ళీ సస్యశ్యామల అవడానికి ఈ హిమగిరియొక్క చల్లదనమేకదా కారణం! అనుకున్నాడు.

ఈ పర్వతరాజు కూతుర్ని పెళ్ళాడేకదా శివుడు గృహస్థుడైంది? ఈ హిమగిరిలోని గంగలో పులోమజకు ఈత నేర్పేకదా ఇంద్రుడు జలక్రీడలోని సొంపును తెలుసుకుంది? యెన్నివిధములైన వోషధులు, యెన్నివిధాలైన రత్నాలు, యెన్ని యజ్ఞ సామగ్రులు. చూస్తూవుంటే యింక యెంత కాలమైనా చూడవచ్చు.

సూర్యుడు నడినెత్తికి రావడంచేత మంచు మెల్లగా కరగనారంభించింది. ఇప్పుడుయింటికివెళ్ళితిరిగి రేపురావొచ్చు. తక్కిన ప్రదేశాలన్నీ అప్పుడు చూచుకోవచ్చు తను యింకా నడిచేవెడుతున్నాడేం! ఇంతసేపు ఒకచోటనుండి వొకచోటికి యెగిరి వెళ్ళలేదూ? మరి యిప్పు డట్లా యెగరడం జరగడం

లేదేం? కాళ్ళకు పూసుకున్న మందుకు ప్రభావం తగ్గి పోయిందా? మెల్లిగా వంగి అరికాళ్ళు చూచుకున్నాడు. ఆ మందువున్న గుర్తైనా లేదు. అతని ముఖం వెలవెల బోయింది. గుండె జారిపోయింది. తా నిప్పు డొక కొండ కొమ్మున వున్నాడు. మబ్బులు అతణ్ణి రాచుకుంటూ పోతున్నవి. మంచు నీళ్ళకు మందు కరిగిపోయింది. ఇంతసేపు అతనికి తెలియనే తెలియదు ఆ సంగతి.

ఆ కొండను చూడాలన్న తన కుతూహలమంతా యెక్కడికో పోయింది. ఒక్కక్షణం చూడకపోతే అటమ టించిపోయే తండ్రీ, సందెపూట యిల్లుకదలనివ్వని తల్లీ, యెప్పుడూ తనకనుకూలంగా నడుచుకునే భార్యా, తోడు నీడల్లా తిరిగే శిష్యులూ — అంతా వొక్కసారి జ్ఞాపకం వచ్చారు. తను కనబడలేదని వారంతా యెంత విచారపడు తుంటారో?

హాయిగా కాలంగడుపుతూన్న తనను విధి యింత దూరం లాక్కువచ్చింది. యింక తాను యింటికివెళ్ళే దెలాగు? చుట్టూ వొక్క మానవుడైనా కనపడడే!

ఎండ మాడ్చివేస్తున్నది. దానికితోడు హృదయంలో ఆవేదన.

ఏదారి తనను యింటికి తీసుకువెడుతుంది. యెవ్వరైనా తనకు యింటిదారి చూపించి పుణ్యంగట్టుకోరా?

ముందుకు నడిచివెళ్ళాడు. అగమ్యగోచరంగా వుంది వనప్రదేశం. సుందరంగా మోహినలాగా మొదట కనుపించిన

స్నానంజేసి, సంధ్యవార్చి, సూర్యనమస్కారంజేసి, ప్రతికిన మడుగుదోవతలు తీసుకుని యింటికివస్తూవుంటే ఆ పురంలోని ప్రజలంతా అతణ్ణి చూస్తూవుంటారు.

అతడు సిద్ధుణ్ని లోపలికి తీసుకువెళ్ళాడు. అతని స్నానానికి నీళ్ళు పెట్టాడు. దేవతార్చనకు కావలసిన సామగ్రి అంతా యిచ్చాడు. సిద్ధుడు చాలు చాలు అంటున్నా అతనికి కావలసిన వస్తువులన్నీ భోజనంలో వడ్డింప జేశాడు. సిద్ధుడతన్ని మెచ్చుకోకుండా వుండలేకపోయాడు.

సిద్ధుడు కొంతసేపు నిద్రపోయాడు. ఆ బ్రాహ్మణ యువకుడు అతని పాదాలు వొత్తుతూ కూర్చున్నాడు.

"నీవు విశ్రాంతితీసుకో నాయనా!" అన్నాడు సిద్ధుడు నిద్రనుండి లేచి.

సాయంకాలం కావస్తోంది. యిప్పుడింకేం విశ్రాంతిలెండి." అన్నాడు వినయం వుట్టిపడే మాటలతో ఆ బ్రాహ్మణుడు.

"అన్నట్టు నీపేరేమిటి తండ్రీ?" అని అడిగాడు సిద్ధుడు లేచి కూర్చుని.

"ప్రవరుడని పిలుస్తారండి—" చేతులు కట్టుకుని కూర్చున్నాడు.

"తగిన పేరోయి నీ కది—."

"తమ రాకవలన మా యిల్లు పావనమైంది. యెక్కడి నుండి యెక్కడికి వెడుతూ యిలా దయచేశారో తెలియజేస్తే విని ఆనందిస్తాను."

సిద్ధుడు దేనో్న ఆలోచిస్తున్నట్టు కూర్చున్నాడు. ప్రవరుడు కొంతసేపు మౌనం వహించి మళ్ళీ ప్రారంభించాడు.

"సంసార బంధంలో చిక్కుకున్న మావంటివార్ని వుద్ధరించడానికి మీ పాదధూళి ఒక్కటే చాలు" అన్నాడు.

సిద్ధుడు నవ్వాడు.

"మీవంటి గృహస్థులు లేకపోతే కుంటీ, గుడ్డీ, నాబోటి సన్యాసులకు, దిక్కెవరోయి. పండిన పెరటి కల్పకం లాంటిది గృహస్థాశ్రమము. దానికి సరి మరొక్కటుందా?" అన్నాడు.

"మీరు దేశయాత్రలు చేస్తుంటారు కనుక, మిమ్మల్ని కొన్ని సంగతులు అడగటానికి కుతూహలంగావుంది."

"ఊఁ" అన్నాడు సిద్ధుడు.

ప్రవరు డడిగాడు కొన్ని ప్రశ్నలు. అతడు యేయే దేశాలు, తీర్థాలు, పర్వతాలు చూచిందీ, ఆయా స్థలాల్లోని వింతలు విశేషాలు, అవి మామూలు ప్రశ్నలు. ప్రతిరోజూ ప్రతి అభ్యాగతుణ్ణీ యిలా అడగడం అతనికి పరిపాటే. రోజూ కుతుపకాలానికి యెవరో్న వొకర్ని తీర్థయాత్ర చేసివచ్చిన వారిని యింటికి తీసుకువస్తాడు. అలాంటివారు యెంత దూరంలో వున్నారని తెలిసినా వెళ్ళి తీసుకొస్తాడు. అతనికి చేయవలసిన సపర్యలన్నీ చేస్తాడు. చేసి వారు విశ్రాంతి తీసుకున్నాక మెల్లిగా పై ప్రశ్నలు అడుగుతాడు. వారు చెప్పేదంతా శ్రద్ధగా వింటాడు. ఆ స్థలాలన్నీ తనకూడా చూడాలని వుందని పెద్దగా నిట్టూర్పు విడుస్తాడు.

సిద్ధుడు తను చూచివచ్చినవన్నీ వివరించి చెప్పాడు. అతడు కేదారేశుణ్ని భజించాడు. హింగుళాదేవిని సేవించాడు. ప్రయాగలో పద్మాక్షుణ్ణి చూచాడు. బదరీనారాయణం వెళ్ళాడు. ఈ దేశం ఆ దేశం అనడమేమిటి నాలుగుదిక్కులను వున్న మధ్య ప్రదేశాన్నంతా చూచాడు. హిమగిరి, పశ్చిమాద్రి, ఉదయగిరి, మలయ పర్వతం చూచాడు.

ఉదయగిరిలో విశేషాలను లెక్కించడానికి ఆదిశేషునికి శక్తి చాలదన్నాడు. మలయ పర్వతంలోని చలువకు విలువ యేమిటన్నాడు. కైలాస పర్వతాన్ని చూడడానికి పూర్వ జన్మసుకృతం కావాలన్నాడు. అస్తగిరిలోని మణిప్రాకారాన్ని తలచుకుంటే వొళ్ళు పులకరిస్తుందన్నాడు. ఇంకా యేమేమో చాలాసేపు చెప్పాడు.

ప్రవరుని బుగ్గలు చిరునవ్వుతో సొట్టలుపడినవి.

"వెరపు లేకుండా అడుగుతున్నందుకు క్షమించండి. ఆ స్థలాలన్నీ చూచిరావాలంటే రెక్కలుకట్టుకు వెళ్ళినా, సంవత్సరాల తరబడి పట్టుతుంది. మీ ముఖం అడుగకుండానే మీ చిరుత వయస్సును సూచిస్తోంది. మీ మహిమ మీకే తెలియాలి" అన్నాడు వినయావనత శిరస్కుడై.

"సందేహం వున్నప్పుడు అడిగితే తప్పేముందోయ్."

ప్రవరుడు ఆత్రంతో వింటున్నాడు.

"మేము సిద్ధులం. మమ్మల్ని యే రోగాలూ అంటవు. ముసలితనం మాదగ్గరికి రాదు, తెలిసిందా, ఇంక యిన్ని

దేశాలు యెట్లా తిరిగి వచ్చానంటావా? విను. ఆ భగవం తుడి దయవల్ల మాకు "పాదలేపము"నే ఔషదం వొకటి సిద్ధించింది. దాన్ని కాళ్ళకు రాసుకుంటే, సూర్యుని గుర్రాలు వొక్కరోజులో యెంతదూరం ఆయాసంలేక వెడుతాయో అంతదూరం వెళ్ళి తిరిగి రావొచ్చు. దాని సహాయంతో యివన్నీ చూడగలిగాను." అన్నాడు.

ప్రవరుని ముఖం పేరాశతో చేటంతైంది.

"నన్ను— మీ శిష్యుణ్ణి— తీర్ధయాత్ర వల్ల ధన్యుణ్ణి చేయరా" అన్నాడు.

"సిద్ధుడు అతణ్ణి జాలిగా చూచాడు. సూర్యుడు అస్తమించాడు.

"సూర్యోదయం కానీ. ఆలాగే వెళ్ళి వత్తువుగాని" అన్నాడు.

ప్రవరుడా సన్యాసి పాదాలు గట్టిగా కౌగలించు కున్నాడు. అతని ఆనందానికి పట్టపగ్గాలు లేకపోయింది.

అతని కా రాత్రి నిద్ర లేకపోయింది. తను యెక్కడికి వెళ్ళాలి? ముందుగా యేదేశం చూడాలి? ఆ మందు యెంత మహిమగలది? తనకు యెన్నిదేశాలు చూపెడు తుంది! అబ్బ! అతడు సన్యాసికాదు, సాక్షాత్తు భగవంతుడే. తనకోరిక యేండ్ల తరబడి తనహృదయంలోవున్న కోరిక సఫలీకృతం చేయడానికి వచ్చిన భగవంతుడే అతడు. ఇంతకీ తను మొదట యెక్కడికి వెళ్ళాలి!

ఆ పర్వతవనం భీకరంగా శూర్పణఖలాగా యెదుట కనుపించి అతని గుండెను హడలెత్తించింది.

ఇంక కొంత దూరం వెడితే యెవరైనా కనుపించరా?

ఒకలోయ కనుపించింది. కిందకు వంగి చూశాడు. వజ్రాయుధంచేత నరకబడ్డట్టు కనబడింది మీాదినుండి క్రింది వరకూ యెర్రగా కొండచరియ. క్రింద ప్రశాంతంగా మెల్లిగా ప్రవహిస్తోంది గంగానది. నది యిరుప్రక్కల వున్న యిసుక నేలమీాద యెత్తుగా దట్టంగా పోక, పున్నాగ, నారంగ నారికేళ మొదలైన చెట్లు పెరిగివున్నై.

పక్షులు ధ్వనులు మిన్నుముట్టుతున్నై. యెన్నడూ విని యెరుగని శ్రావ్యమైన సంగీతధ్వని కొండగుహల్లో ప్రతి ధ్వనిస్తోంది.

ఇక్కడ యెవరో వుండి వుండాలి! బహుశా మున్యా శ్రమము కావచ్చు. కిందకు యెట్లా దిగడం?

కొండ కొనమీాద బాగా నాటుకున్న మల్లెతీగ వొకటి దట్టంగా పెరిగి కిందికి పాకివుంది.

ప్రవరుని ప్రాణం కాస్త కుదుటబడింది.

తాళ్ళవలె వ్రేలాడుతున్న ఆ మల్లెతీగలను వూతగా పట్టుకుని క్రిందకు జారి, మెల్లిగా దిగుతున్నాడు. తుమ్మెదలు ఝుంకరిస్తూ పైకి లేచినై.

కిందకు దిగితే తనకు తప్పకుండా యెవ్వరైనా కనుపిస్తారు. తనకు యింటికి వెళ్ళేదారి తప్పకుండా దొరుకుతుంది. ఆ మల్లెతీగలే తన ధైర్యానికి కూడా పట్టుగా వుంది.

## 17

ఆనాడు వరూధినిలో వొక వింతమార్పు కనుపించింది. ఆమెలో ఆమెకే కనుపించింది. తను యెన్నడూ చూచి యెరుగని వొక అద్భుతమైన వస్తువుని ఆమెకు ఆవాళ యెవరో చూపించబోతారని ఆమెహృదయానికి మాటిమాటికి తట్టింది. ఆ వస్తు వేదో చూడాలని ఆమెకు కుతూహాలం ఎక్కువైంది. ఏదో చెప్పరాని ఆనందం అనుకోని పులకరింపు ఆమెకు కలుగుతోంది. మళ్ళీ ఆవస్తువేదో తనకు కనబడి చేతికి దక్కకుండా పోతుందని ఆమెకు హృదయంలో వొకపక్క భయంకలిగింది.

ఆమెలో వొక వింత మార్పు మాత్రం కలిగింది. ఆమార్పు ఆమెకు యేమీ తోచనివ్వకుండా చేసింది. పొద్దుటినుండీ ఆమె దేనికోసమో తోటంతా తిరిగింది. గుహలోకి వెళ్ళి రెండుమూడుసార్లు తన విగ్రహా లన్నీ చూసివచ్చింది. శిల్పి రాలేదు. రామేశ్వర యాత్ర నుండి అతడింకా తిరిగి రాలేదు. యెప్పుడు వస్తాడో? బహుశా అతడే తన కా వస్తువుని తెచ్చి చూపిస్తాడేమో!

మధ్యాహ్నం సమీపించింది. ఆమె భోజనం చేసింది. తాంబూలం వేసుకుంది. ఆ తాంబూలంలోని కస్తూరి వాసన పచ్చకప్పూరపు వాసనను రెట్టించింది. ఆమెకు యేమీతోచడం లేదు. గూనెన తొడిగి మూలకు చేర్చబడ్డ వీణ ఆమెకంట బడింది. దాన్ని ముట్టి చాలా రోజులైంది. దాన్ని వాయించా లనిపించింది. మెల్లిగా తీసి దుమ్ము దులిపింది. శృతికలిపి

బయటకు తీసుకువచ్చింది. అంగణంలోవున్న మామిడిచెట్టు క్రింది పాలరాతి తిన్నెమీద కూర్చుంది.

నాటిరాగం విచిత్రంగా వీణాధ్వనితో కలిసి బయలు దేరింది. తాంబూలపు సువాసన ఆ పాటకు మరింత తియ్యదనాన్ని కలిగించింది. రత్నకంకణాలధ్వని ఆమె పాటకు తాళమైంది. ఆమె ఆలాపనలో లీనమైంది. అరకన్ను మోడ్చింది. ఆ మోడ్పు ఆమెకు సురతపారవశ్యపుసొబగును చేకూర్చింది.

ఆమె కట్టిన యెర్రని పావడపైనవేసిన తెల్లని పమిట లోంచి ఆమె కూర్చున్న పాలరాతి తిన్నెనుకూడా తనరంగు లోకి కలుపుకుంది.

ఆలాపన. మరీ మరీ యింపుగా సొంపుగా బంగారు తీగెలు సాగినట్లు ఆ వనంలోని అన్ని పక్షులనూ నిశ్శబ్దంగా వుండేట్టు చేస్తోంది.

పాట హఠాత్తుగా ఆగిపోయింది. వరూధిని అట్లాగే ప్రతిమలా చూస్తోంది. దూరంగా యేదో పురుషాకృతి. రాజఠీవితో నడచివస్తున్న పురుషాకృతి. తను యెన్నడూ చూడని అపూర్వ సుందర పురుషాకృతి ఆమెకు కనుపించింది. ఆశ్చర్యంతో ఆమె కనుదామరలు వికసించినై. మేను గగుర్పొడిచింది. వీణను పాలరాతితిన్నెకు చేర్చి, లేచి సమీపంలోవున్న పోకచెట్టు దగ్గర నిలబడింది.

ఆ పురుషాకృతి మరీ మరీ దగ్గరకు వస్తోంది. ఆమె కన్నులు మొదట కొంకుపాటుతో చలించింది. యేదో

చెప్పరాని ఆనందం చూపులకు కొంత విస్తరత్వాన్నిచ్చింది. మదిలో యీరికలెత్తుతున్న కోరికలు ఆ చూపులను గెంతు లాడించినవి. లోలోపలనే అతణ్ణి మెచ్చుకోడంతో రెప్పలు కొట్టుకుంటున్నై. ఆమె కన్నులు బాగా వికసించిన కమలా లయినవి.

ఆమె ఫాలభాగం లే చమటతో తడిసిపోయింది. కస్తూరీ తిలకం కరిగి, కన్నులు మరీ పెద్దవిగా అయి ఆమె ముఖాన్ని ఆక్రమించకుండా వుండడానికి మన్మధుడు గీసిన గీటులాగా ఆమె చెక్కిళ్లమీద కారింది.

ఎవ రాతడు ? ఎవరో బ్రాహ్మణ యువకునిలా వున్నాడు ! ఎంత చక్కనివాడు ? ఇతని చక్కదనం ముందు మన్మధాదులు పనికివస్తారా ? ఇతని బ్రాహ్మణవంశ మెక్కడ ! ఈ సౌందర్య సంపద యెక్కడ !

ఆమె కతడు కావాలనిపించింది. ఎవరో యేదో వింత వస్తువును చూపిస్తారని ఆమెకు కలిగిన భావం, ఆ వస్తువు యిదేనని ఆమెకు నిశ్చయమైంది.

ఇతడు తనవాడౌతాడా ? తనకు యెందు కీ కోర్కె. ఏమో ! తన కతడు కావాలనిపిస్తోంది. అతని కౌగిట్లో తాను నలిగిపోవాలనిపిస్తోంది.

అతడు తన కోర్కె తీరుస్తాడా ! అబ్బ ! యేమి ఆకారం అతనిది ? తామరరేకులలాంటి కన్నులు. మన్మధ సింహాసనంలా యెత్తుగావున్న వక్షం. యెత్తుగా చెవులతో సరసమాడే భుజాలు. చిగుళ్ళలా యెఱ్ఱగావున్న పాదాలు.

బ్రహ్మ యితణ్ణి ప్రత్యేకంగా అతి శ్రద్ధతో సృష్టించాడు. జంబూ నదిలోని బంగారువన్నె బంకమట్టితో సూర్యుణ్ణి సాన బెడితే రాలిన పొడిని కలిపి, అమృతాన్ని పదునుకు పెట్టు కుని సిద్ధపరిచాడు ఈ ఆకారాన్ని. లేకపోతే ఇతని శరీరానికి యింత కాంతి వస్తుందా!

అతడు దగ్గరకే వచ్చేస్తున్నాడు! ఇంక మాటున నిలిచివుండడం ఆమెకు ఇష్టంలేదు. గలగలమనే కాలిఅందెల చప్పుడుతో అతనిదోవకు అడ్డంగా వెళ్ళి నిలిచింది. ఎవ రా పురుషుడు!

అతడు ప్రవరుడు. పాదలేపన సహాయంతో హిమగిరికి వచ్చి దారి తప్పిపోయిన ప్రవరుడు. మల్లెతీగల సహాయంతో క్రిందకు దిగిన అతనికి మణులతో చేయబడ్డ మెట్లు కనిపించి నవి. అది జనస్థానమని అతనికి నిశ్చయమై, మరికొంత ముంద రికి వచ్చాడు. గమగమలాడే తాంబూలపు వాసన అక్కడ స్త్రీ ఉనికిని తెలుపుతున్నా, అది మునుల ఆశ్రమమై వుంటుం దనే ఆశతో ముందరికి నడిచి వచ్చాడు. వరూధినిని చూసి అతడు విభ్రాంతుడైనాడు. ఆమె సౌందర్యానికా? కాదు. ఆ నిర్జనారణ్యంలో వొంటరిగా వొక స్త్రీ కనుపించినందుకు.

వరూధిని అతణ్ణి చూస్తూనేవుంది. అతని యెత్తైన వక్షాన్ని చూస్తూనేవుంది. తన విశాల నేత్రములు అప్పుడే సార్థకమైనవనుకున్నది. అతని ముఖంలో యేదో దైన్యం చూచింది. ఆమెకు జాలి కలిగింది. తనతో అత డేదో

మాట్లాడ్డానికి సంకోచిస్తున్నాడని ఆమె గ్రహించింది. కనుక్కో వాలనుకునికూడ ఆమె వూరుకుండిపోయింది.

ప్రవరు డామెను యెగాదిగా చూచాడు. చుట్టూ కలయజూచాడు. అతని కంతా కొత్తగావుంది. ఆ నిర్జన ప్రదేశంలో ఒక దివ్య భవనం, వొక సుందరి! ఎవ రామె! ఆమెకు తనయింటిదారి తెలుసా! "ఈ భీకరారణ్యంలో భయంలేకుండా వొంటిరిగా సంచరించే నువ్వు యెవర"వని అడిగాడు. తనపేరు చెప్పాడు. తన సంగతంతా చెప్పాడు. బుద్ధి గడ్డితిని వచ్చేశానని పలికాడు. ఇంటికి దారి తెలిస్తే చెప్పి పుణ్యంగట్టుకోమన్నాడు.

వరూధిని నవ్వింది. కిలకిలమని నవ్వింది. అతని స్థితికి ఆమెకు జాలికలిగింది. కాని నవ్వింది. తన కతడు కావాలి. అతణ్ణి నవ్వించాలి. తనవాణ్ణి చేసుకోవాలి.

"ఇంతంతకన్నులు పెట్టుకుని నీకు వచ్చినదారే తెలియదా!" అంది.

అతడు నివ్వెరపోయి ఆమెవంక చూచాడు...

"ఒంటిరిగా కనబడ్డ నాలాంటి యువతులను పలకరించే మెత్తు లివి. నీ కంటికి అంత చులకనగా కనబడుతున్నానా" అంది మళ్ళీ.

ప్రవరుడు యేమీ మాట్లాడలేదు. ఆమెను మాట్లాడించటం తప్పనుకున్నాడు. వరూధినికి అతనివాలకం చూచి మనస్సు చివుక్కుమంది. అతణ్ణి నొప్పించాననుకుంది. తనెవరో అతనికి చెప్పి అతని మనస్సును తనవైపు తిప్పుకోవాలనుకుంది.

"నాపేరు వరూధిని. రంభ తిలోత్తమ మొదలైన వాళ్ళు నాకు చెలిమికత్తెలు." అంది. అకృణ్ణించి వెళ్ళిపోవాలనే ఆత్రం అతని ముఖంలో కనుపించింది. వరూధిని తనచరిత్రను పెంచింది. క్షీరసాగరం జన్మస్థానమన్నది. లక్ష్మీ చంద్రులు తోబుట్టువులంది. రాళ్ళు కరిగించే గాంధర్వం తన విద్య అని చెప్పింది. మన్మధశాస్త్రం పుట్టుకతో వచ్చునంది. అశ్వమేధాది సవనతంత్రములు తమకు కానుకలని పలికింది. హరిహర బ్రహ్మసభలు నాట్యస్థానములనికూడా చెప్పింది. ఇంకా యింకా బంగారు కొండా అవీ యివీ చాలా చెప్పింది. అతడిదేమీ వినిపించుకున్నట్టు ఆమెకు తోచలేదు.

ఇన్ని రోజులూ తను చేయకూడదనుకున్న తళుకులన్నీ యిప్పు డతనిముందు చేయాలనిపిస్తోంది. పురుషులను ఆకర్షించడానికి యెన్నెన్ని చెయ్యాలో అన్నీ చేయాలనిపించింది. ఆమె మనస్సులో నళినాక్షుడు నవ్వాడు. ఆమె హృదయం భయపడింది. నిర్మలంగా కళకోసమే, కళారాధకులకోసమే తాను వుండాలనుకున్నదంతా యిప్పుడు తలకిందులైంది. తన కితడు కావాలి. లభిస్తాడా? కనుక్కోవాలి!

"మా యింటికి యీపూట అతిథివి నువ్వు." అన్నది అతని కన్నులలోకి చూస్తూ.

"బంగారంలాంటి నీ శరీరచ్ఛాయ యీ పగటి ఎండకు యెట్లా కందిపోయిందో చూడు! వడకి నీ ముఖకమలం వాడిందోయీ! మా యింట్లో యీ పూట విశ్రాంతి

తీసుకుని మాయిల్లు పావనం చేయమని ప్రార్థిస్తున్నా''నంది. అత డేమంటాడో అని ఆశతో చూసింది. ప్రవరుడు నవ్వాడు. ఆవేదనతో కూరుకుపున్న ఆ ముఖంలో ఆ నవ్వు కారుమబ్బు చాటునవున్న చంద్రుని కాంతిలా వుంది.

"నీ విచ్చిన ఆతిథ్యం నాకు చేరింది తల్లీ! యిక్కడ వుండటానికి వీల్లేదు. యింటికి వెళ్ళాలి. నేను వచ్చి వొకటీ రాకుండా వొకటీనా. భక్తియే చాలు. పూజవేళ అతిక్రమించింది.'' అన్నాడు.

వరూథిని నిర్విణ్ణ అయింది. తాను అడగడమే తరువాయిగా అతను వుండిపోతాడనుకుంది. తల్లీ అని పిలుస్తున్నాడు. యింతాచేసి, తా నతనికి తల్లి అయిందా!

"మీది దివ్యమహాత్మ్యము తల్లీ! నే నిల్లుచే రేవుపాయ మేదైనావుంటే చెప్పు. తలచుకుంటే నీ కసాధ్యమైంది ఏదీ వుండదు. మావారితో నన్ను కలిపి పుణ్యంగట్టుకో తల్లీ!'' అన్నాడు మళ్ళీ.

తల్లి, తల్లీ! ఆ పిలుపు ఆమెగుండెలో ఈటెతో పొడిచినట్టయింది. తన తళుకు బెళుకులు అతణ్ణి ఆకర్షించినట్టుగా లేవు. చల్లకువచ్చి ముంత దాచడమెందుకు? అతణ్ణి యెట్లాగైనా ఆపాలి. ఆపి తనవాణ్ణి చేసుకోవాలి.

"మాటిమాటికి వూరు వూరంటావు. ఇక్కడ కాలు నిలవడంలేదా? మీ వూరి గుడిసెలకు సరిరాకపోయినవా యిక్కడి యీ రత్నకందరాలు, యిక్కడి గంగాసైకతాలు,

యిక్కడి చందనవనం, యిక్కడి వెన్నెల తీగపొదలు?'' అని అడిగింది. తనకోరికను యింక దాచడం ఆమెకు యిష్టంలేదు.

నా మనసు నీమీద లగ్నమైంది. నన్ను మన్మథునికే అప్పచెబుతావో నీవే యేలుకుంటావో!'' అంది. అనలేక అనలేక అంది. తను వేశ్యాకులంలోనే పుట్టానని అప్పు డామె తెలుసుకుంది.

ప్రవరుడు తలవంచుకున్నాడు. ప్రశాంతంగా నిశ్చలంగా బదులు పలికాడు.

"వ్రతాలతో కాలంగడిపే మావంటివారిని కామించడం తగునా?' నే నిప్పుడు యిల్లు చేరకపోతే అన్ని ధర్మాలు కూలిపోతవి. అతిథి సత్కారం, దేవతార్చనా అంతా మంట గలిసిపోతుంది. ఆకలితో తల్లీ,తండ్రీ యెదురుచూస్తూవుంటారు. నీకు తెలిసివుంటే యింటికి దారిచూపించి పుణ్యంగట్టుకో''  అన్నాడు.

వరూధిని ముఖం వెలవెలబోయింది.

"ఈ లేతవయస్సు వైదికకర్మలతో చెల్లిపోతే యింక నీవు భోగము లనుభవించే దెన్నడోయీ! యజ్ఞాలకూ యాగాలకూ ఫలంగా లభించేది మా కౌగిళ్ళ సుఖమేకదా'' అంది. "నీకు యేమేమి కావాలోయి? కస్తూరి, పన్నీరు, జవ్వాది, పచ్చకర్పూరము, యింకా యింకా కల్పక సంజనిత మైన రత్నభూషణములు, వస్త్రములు, ఫలములు — యేమేం కావాలో అన్నీ నాతోవుండి యిక్కడ అనుభవింపలేవా

గుక్ష్మీవానిముందు వెన్నెల అందంలా గంధర్వాంగనలపొందు నీకు తెలియడంలేదు. మళ్ళీ ఆ సంసారానికే పోతానం టున్నావు ? ” అంది.

ప్రివరుడు చలించినట్టు లేదు. ”

“ ఎన్ని జన్మలెత్తితే లభిస్తుందోయీ నీ కిటువంటి తరుణం. యిట్లా నీకోసం మన్మథాగ్ని చేతపిస్తూ, చిన్న బాటుతో చూస్తూ వెన్నలా కరిగే యువతులు యెట్లా లభిస్తారోయీ ! నీశరీరాన్ని యీ విధంగా వుపవాసాలతో కృశింపజేయడం నీకు న్యాయమేనా ? ” అంది.

“ నిజమే, నీవు చెప్పిన అర్థమంతా కాముకునికి సరిపో తుంది. నేనకాముకుణ్ణి ” అన్నాడు “ బ్రాహ్మణుడు యింద్రియ వశుడై మన్మథునికి లోబడితే తనకు లభించే బ్రహ్మానంద రాజ్యాన్ని పోగొట్టుకుంటాడు ” అన్నాడు నిశ్చలంగా.

వరూథిని అతణ్ణి అదొక మాదిరిగా చూసింది.

“ బ్రహ్మానందమంటే ? ” అంది. యెక్కడ హృదయం చెమర్చుతుందో ఎక్కడరక్తితో నిశ్చలంగా, కుంభగత ప్రదీపకళికకాంతిలావుంటుందో, యింద్రియాలన్నీ అటుయిటు పోకుండా యెక్కడ సుఖాన్ని పొందుతాయో ఆ యింపే గదా పరబ్రహ్మము. “ ఆనందో బ్రహ్మ ” అన్న వేదవాక్కు నొక్కసారి జ్ఞాపకం తెచ్చుకోవోయీ ! ” అన్నది.

ప్రవరునికి సిగ్గు కలిగింది. వెగటుపుట్టింది.

“ ఈ చదువు నీదగ్గరతప్ప మరెక్కడా వినలేదు. కామశాస్త్రోపాధ్యాయినివిలా వున్నావు. మోక్షాన్ని పొంద

డానికి మీా కిదే మార్గములావుంది. యింక నీతో వాదించి లాభంలేదు.'' అన్నాడు.

వరూధిని చుట్టూ చూస్తోంది యెవరైనా తనను చూస్తున్నారేమోనని.

"హవ్యములతో తృప్తిపొంది అగ్నియిచ్చే సుఖాలను వర్ణించడానికి సాధ్యమవుతుందా? నాకు అరుణలు, దర్భలు ప్రియములైనట్లు మరేవీ కావు. ఈ శరీరం శాశ్వతమైందా. యిట్టి తుచ్ఛసుఖాలు నాతో చెప్పకు. మీాసాల మీాది తేనెలాంటివి అవి'' అన్నాడు.

వరూధిని తాను పూర్తిగా ఓడిపోయాననుకుంది. ఆమె కళ్ళల్లో నీళ్ళు తిరిగినై. ఆమె మనస్సులో నళినాక్షుడు నవ్వాడు. ఆమెహృదయం భయపడింది. నిర్మలంగా కళకోసమే, కళారాధకులకోసమే తాను వుండాలనుకున్నదంతా యిప్పుడు తలకిందులైంది. తన కితడు కావాలి. అతని యెత్తైనవక్షంతో తన వక్షోజాలను, అతని అధరబింబంతో తన—— కలిపి——. సాహసించడంకన్నా గత్యంతరంలేదు అనిపించింది.

ఆమె పమిట తొలగిపోయింది. నీవీబంధం సడలిపోయింది. ఒళ్ళంతా పులకరించింది. చెమర్చింది. కొప్పులోని పువ్వులు నేల రాలుతున్నై. రతిసంరంభం ఆమెలో హెచ్చింది—— సాహసించింది.

అతని వక్షంతో యెత్తుగా మన్మధ సింహాసనంలావున్న అతని వక్షంతో తన వక్షోజాలను కలిపింది... అతని అధరాని

కోసం — తియ్యగా — అమృతంలావుండే అతని అధరాని కోసం — దీనంగా ఆశగా అతని కళ్ళలోకి చూసింది.

"శ్రీహరీ!" అన్నాడు ప్రవరుడు ముఖాన్ని పక్కకు తిప్పుకుంటూ. ఆమె రెండుభుజాలను పట్టి వొక్కతోపు త్రోశాడు.

అతడు ధీరుడు. ఆడుదాని మాయలు అతణ్ణి చలింప చేయలేదు.

వరూధిని కిందపడింది. ఆమెకు యేడ్పు వచ్చేసింది. నీ గోరు యిక్కడ యెట్లా గుచ్చుకుందో చూడు!" అని వొకమిష పెట్టి పెద్దగా యేడ్చింది.

"యజ్ఞాలు, యాగాలూ చేశానంటావు. దయ అనేది లేకుండా యెన్ని జేస్తేనేం? దయ వొక్కటి వుంటే చాలు, కోటియజ్ఞాలు చేసినంతఫలం, లభిస్తుంది. ఈమాత్రం తెలుసుకో లేని నీ చదువెందుకు?" అంది.

అత డేమీ పలుకలేదు. మెల్లిగా నడిచివెళ్ళి సమీపంలోవున్న కొలనులో దిగాడు. ఆమె కౌగలించుకోగా తనవంటికి అంటిన కుంకుమా, కస్తూరీ మొదలైనవాటి పరిమళాన్ని కడుక్కుంటున్నాడు.

వరూధినికి రోషం హెచ్చింది.

"దాశకన్యను చేపట్టిన పరాశరుణ్ణి మీవాళ్ళు వెలిపెట్టారా! విశ్వామిత్రుడు మేనకతో రమించలేదా? మాంద కర్ణికి మహిమ తగ్గిపోయిందా? దేవకాంతలతో కూడి,

అహల్యాజారుడైన యిందుణ్ణి రాజ్యమేలనివ్వడంలేదా? వాళ్ళంతా నీకంటే తక్కువవాళ్ళా? మహామహా మునులంతా మా కౌగిళ్ళలో బంధింపబడలేదా...?" అంది.

అత డా మాటలేమీ వింటున్నట్టులేదు. యేదో ధ్యానంలో వున్నాడు. అగ్నిస్తుతి చేస్తున్నాడు. కన్నీటి తెరలలోంచి వరూధిని అతణ్ణి చూస్తోంది. పెద్దగా వాక వెలుగు వచ్చింది. వేయిమంది సూర్యులు దగ్గరకువచ్చినట్టు ఒక వెలుగు వచ్చింది. ఆ వెలుగును వరూధిని చూడలేక పోయింది. ఆమెకండ్లు చీకట్లు కమ్మినై. "హా!" అని మూర్ఛపడింది వరూధిని. అంతే.

ప్రవరుడు కన్నులు తెరిచాడు. తల్లీ, తండ్రీ, భార్యా, శిష్యులూ అంతా తనరాకకోసం యెదురుచూస్తూ బయట నిలబడివున్నారు.

"మరెప్పుడూ యిట్లా వెళ్ళను" అని అన్నాడు తల్లిని, తండ్రిని కౌగలించుకుంటూ.

అగ్నిదేవుడు ప్రవరునికి సహాయ పడ్డాడు.

## 18

"ఇటు చూడు తల్లీ!" చిరకాల పరిచితమైనకంఠం వాత్సల్యంతో పలికింది.

వరూధిని మెల్లిగా కన్నులు తెరచి చూచింది. చుట్టూ చూచింది. తను శయ్యమీద పరున్నట్టు ఆమెకు తోచింది. నిజంగానే ఆమె పరుపుమీదపరున్నది. ముసలిశిల్పి పన్నీటిలో తడిపిన గుడ్డతో వరూధిని నొసటిమీద వొత్తుతున్నాడు. నళినాక్షుడు రెండుచేతులూ కట్టుకుని నిలబడి చూస్తున్నాడు మంచందగ్గరగా.

"తాతా వచ్చావా?" అంది లేవబోతూ.

"వచ్చానమ్మా — కొద్దిసేపటికి ముందే వచ్చాను. నువ్వు మూర్ఛపడివున్నావు తల్లీ! నళినాక్షుడు నిన్ను తోట లోంచి యెత్తుకు వస్తుంటే చూశాను."

"నువ్వు — అతణ్ణి. నా మనోహరుణ్ణి చూశావా తాతా— ఎక్కడికి వెళ్ళాడో చెప్పవూ?" దీనంగా అడిగింది.

తాత తనకు తెలియదన్నట్టు తలవూపాడు.

"నువ్వు చూశావా — నళినాక్షా?" అని అడిగింది.

అత డేమీ పలుకలేదు. దీర్ఘంగా వొక నిట్టూర్పు విడిచాడు.

"తాతా అతడు నాకు కావాలి తాతా! యెక్కడికి వెళ్ళాడో చెప్పవూ?" పసిబిడ్డలా బావురుమని యేడ్చింది.

తాత ఆమెను ఓదార్చాడు. వరూధిని అక్కడ వుండలేక పోయింది. బయటకు పరుగెత్తివచ్చింది. "వరూధినీ!" అని చెయ్యి పట్టుకున్నాడు తాత. "వదిలిపెట్టు తాతా! అతడు చాలాదూరం పోకముందే అతణ్ణి పట్టుకోవాలి" వరూధిని విడిపించుకోడానికి ప్రయత్నించింది.

"అతడు నీ కిప్పు డెట్లా కనబడుతాడు తల్లీ? ఒంటరిగా అడవిలోకి పరుగెత్త లేవు వరూ!"

"నన్నాపకు తాతా!" విడిపించుకుని పరుగెత్తింది.

"నా తల్లికి వెర్రి పట్టింది" అన్నాడు తాత.

నళినాక్షుడు యేమీ మాట్లాడలేదు.

"అతణ్ణి చూశావా నువ్వు నళినాక్షా?" అని అడిగాడు.

"చూశాను..."

"ఎవ రాతడు?— వరూధినిని ధిక్కరించాడా?"

"అతడు మహానుభావుడు"

"అతడు వెళ్ళినదారి నువ్వు చూడలేదా?"

"లేదు"

"నువ్వేదో దాచిపెడుతున్నావు."

"దాచవలసింది నా కేమీ లేదు—" నళినాక్షుడు వెళ్ళిపోయాడు.

తాత నళినాక్షునివంక చూస్తూ నిలబడిపోయాడు.

వరూధిని పరుగెత్తింది. అడవిలోకి పరుగెత్తింది. ప్రవరుని అడుగుజాడలకోసం వెదుకుతూ పరుగెత్తింది.

"ప్రవరా!" అని గట్టిగా పిలిచింది. యింకా గట్టిగా పిలిచింది. ఇంకాగట్టిగా పిలువలేక పిలిచింది. కొండగుహాలు ప్రతిధ్వనించినై. నిర్జన ఘోరారణ్యం నిశ్శబ్దంగా వుండిపోయింది.

వరూథిని అలసిపోయింది. నడవలేక వొక రాతిమీద కూర్చుంది. కాని ఆమెకు కూర్చోబుద్ధి పుట్టలేదు. మళ్ళీ ఆ కొండ చరియల్లో అలసిపోయిన కాళ్ళను బరువుగా లాక్కుంటూ నడిచింది.

"ప్రవరా!" అని మళ్ళీ అరిచింది.

"ప్రవరా!" మళ్ళీ యెవరో పలికారు. "ప్రవరా!" అని యింకొకరు పలికారు. గొల్లుమని చాలామంది నవ్వినట్టు వినిపించింది.

వరూథిని నివ్వెరపోయి చుట్టూచూసింది.

"ఓసి నువ్వేనటే!" అంది ఒక కోకిలకంఠం."

"ఆడబోయినతీర్థం యెదురైంది" అంది మరొకకంఠం.

వరూథిని వెనక్కుతిరిగి చూసింది. రంభ ఊర్వశి ఆమెవాలకాన్నిచూసి నవ్వుతున్నారు. వెనకనుండి గుంపు గుంపులుగా వస్తున్నారు అచ్చరలంతా. వరూథినికి ముళ్ళ కంపమీద పడ్డట్టు అనిపించింది.

"ప్రవరు డెవరే? కొత్తగావున్నాడు!" అంది రంభ.

"అదిమెచ్చినవాడు. యెవ్వరైతే నీకెందుకే?" అంది ఊర్వశి రంభచెవులనుమెలిపెడుతూ. అందరూగొల్లుమన్నారు.

వరూధిని యేమీ మాట్లాడలేదు. ఇంక వాళ్ళను విడిపించుకోడం కష్టం. తాను యింటిముఖం పట్టడమే వుత్తమమని తోచింది.

ముందరికి నడచింది. ఆమెను అనుసరించి వస్తున్నారు అమరకాంతలందరూ.

ఒక్కొక్కరూ వొక్కొక్క ప్రశ్న వేస్తున్నారు. వరూధినికి యేడుపు వచ్చేసింది. ఊర్వశిని గట్టిగా కౌగలించుకుంది. వెక్కుతూనే తనకథఅంతా చెప్పింది.

అందరిగుండెల్లో వొక్కసారిగా జాలికలిగింది.

ఊర్వశి ఆమె కాటుకకన్నీళ్ళను తుడిచింది తన తెల్లని పమిటతో. అందరూ వరూధిని యింటిముఖం పట్టారు.

సూర్యుడు వరూధిని దుఃఖాన్ని చూసి, ప్రవరునిమీద కోపంవచ్చినట్టు యెర్రనికాంతిని వహించి పశ్చిమాద్రిని సమీపించాడు.

# 19

సంధ్యవేళ. నదీతీరంలో ఒకచక్రవాకి తన జోడుకోసం వెదుకుతోంది. యే చక్రవాకాన్ని చూసినా తన ప్రియుడే నని దగ్గరికి వెడుతోంది. వెళ్ళి అది తనజోడు కాదని తెలిసి, మెడయెత్తి ఆకసంవైపు చూస్తుంది. చూసి మళ్ళీ తామరాకు మీద యెక్కి కూర్చుంటుంది. గొంతు యెండిపోవడంచేత తనముక్కును నీటిలో అద్దుతుంది. అద్ది నీళ్ళు త్రాగడానికి

సహించక అటూఇటూ చూసి నీటిలో తననీడ కనుపడగా భ్రమసి లోపలికి వురుకుతుంది. ఉరికి రెక్కలు తడిసి మరొక తామరాకుమీదకు వెళ్ళి కోపంతో "ఝుం"కారం చేస్తున్న తుమ్మెదలను ముక్కుతో పొడుస్తున్నది. దాని ప్రియుడు యెక్కడికి వెళ్ళాడో !

వరూధిని సఖురాండ్రతో యిల్లు చేరింది. ప్రవరుడు తన కౌగిలిని నిరాకరించి వెళ్ళిపోయాడు. దరిలేని ఈ వియోగ సాగరాన్ని తాను యెట్లా యీదగలదు ? కోరనోములునోచిన తా నెక్కడ ! వాని కౌగిలి యెక్కడ ! విధిని యేమిచేస్తే పాపంవస్తుంది !

ప్రవరుని స్వరూపాన్ని పరిమళంతోకూడుకున్న బంగారంలాంటి అతని శరీరచ్ఛాయ, తుమ్మెదబారులను ఆశ్చర్యపెట్టే తలవెంట్రుకలు, చంద్రుణ్ణి నోరుకదపనివ్వని ముఖం; వికసించిన తామరపద్మంలాంటి అతనికళ్ళు ఆమె మరచి పోలేకపోతోంది.

నిండుయావనంలో అంతచక్కదనంలోవున్న పురుషుడు కౌగలించుకుని, అనుభవించి ఆనందింపచేయని ఒకస్త్రీయొక్క యావ్వన మెందుకు ? చక్కదన మెందుకు ? చివరకు బ్రతుకే యెందుకు ?

నిజంగా మానవ యువతులు చాలా పుణ్యం చేసుకుని పుట్టారు. ప్రియుడు అవమానంచేస్తే, యెందులోనన్నా పడి చావనైనా చస్తారు. తాను అమరకాంతగా పుట్టి చావు

రాకుండా, చింతతో బాధపడవలసివస్తోంది. శూన్యగృహంలో పెట్టిన దీపంలా అయింది చావులేని తన చెల్వమంతా!

క్రమంగా సంధ్యా రాగం క్షీణించింది. లేజీకట్లు క్రమ్మినై. చూస్తూవుండగానే తన ముఖంమీద పడుతున్న చీకటికురులను దిద్దుకోడానికి తొలిదిక్కు జవరాలు చేతితో పట్టుకున్న దంతపు దువ్వెనా అన్నట్టు తెల్లగా కనుపించింది వాక రేఖ.

చంద్రోదయమైంది. చంద్రుడు వాక్కొక్క అడుగే పైకి వస్తున్నాడు. మొదట యెర్రగా కనుపించిన చంద్రుడు యిప్పుడు శుద్ధంగా వున్నాడు. అతడు సహజంగా శుద్ధుడే. ఉదయగిరిలోని గైరికామలమెరుపు సమీపంలోవున్నందుకు అతనిలోకూడా ప్రతిఫలించింది. అది సహవాసదోషం!

పిండారబోసినట్లు మెండుగా వెన్నెలకాస్తోంది. వరూథిని యింటిదగ్గర వుండలేకపోయింది. తాను అప్పుడప్పుడూ ఆ లోయలో చూసిన గంధర్వ దంపతుల విహారం ఆమెకు జ్ఞాపకంవచ్చింది. ఆమె హృదయం పరితపించింది. తోటలోకి పరుగెత్తింది. రంభాదులంతా ఆమెను అనుసరించారు.

ఆమెకు వెన్నెల వేడిగా తోచింది. తల ముసుగుతో కప్పుకుంది. ఆమెకు బ్రతికివుండడం యిష్టంలేదు. ఆత్మ హత్య చేసుకుందామనుకుంది. బాణాల్లా వస్తూన్న వానగాలికి యెదురుగా వెళ్ళింది. పయటను తొలగించి సముద్రమనే భ్రమతో వెన్నెల్లోకి పరుగెత్తింది. కారుచిచ్చనుకుని పొద

రింటిలోకి వురికింది. ఉరితాళ్ళు అనుకుని పూలతీగలను పట్టు కుంది. ఆమెకు యెటూ పాలుపోవడంలేదు.

"వెఱ్ఱిదానా! వెన్నెలకు భయపడి, మన్మథసైన్యానికి విడిదిఅయిన ఈ వసంతవనంలోకి వస్తే నీ విరహావేదన తగ్గిపోతుందా! ముల్లుదీసి మేకుకొట్టినట్టుంది. పద యింటికి వెడదాం!" అన్నారు చెలికత్తెలందరూ. వరూథినితో ఆ రాత్రి గడపాలని వచ్చారు వారంతా పాపం! వరూథినిస్థితి చూస్తే యీవిధంగా వుంది! అందరూ బలవంతంగా ఆమెను యింటికి లాక్కువెళ్ళారు.

వరూథినివిరహావేదన ననుభవిస్తోంది. చంద్రుడుఆమెను పరితపింప చేస్తున్నాడు! విరహిణులను వేధించడం అతని కదొక నేర్పో! లేక రాజైనందున యీలాంటి దురితాలు చేయడమో! గురుసేవవలన వివేకం నేర్చుకోలేదో!

ఈ రాజుకూ యమధర్మరాజుకూ భేదంలేదు. కాని ప్రాణులను హింసించేటప్పుడు అతనికి ధర్మపదం వొకటి అధికంగా వుంది. వరూథిని తపిస్తోంది.

చంద్రుడు త్రిలోకకంటకుడు. అందుకనే పాతాళానికి వొక సర్పమూ, భూమికి చకోరకమూ, స్వర్గానికి సురులూ ప్రతినిధులుగా అతణ్ణి భక్షిస్తూవుంటారు. కాని వారికడుపు జొచ్చినా జీర్ణించడు. ఈ పద్ధతి వాతాపిదగ్గర నేర్చుకున్నాడో అతణ్ణి తినికూడా సురులు వారి ఆయువుచేత చావరుగాని, లేకపోతే——

పాలసముద్రంలో పుడితేమాత్రం మేలిగుణం అతనికి యెట్లా వస్తుంది! అగ్ని నీళ్ళలో పుట్టలేదా! లోకాన్ని దహిస్తున్నాడు కరుణలేకుండా.

గోసంహారం చేసే తురకలకు అతడు దేవుడు. స్త్రీ హత్యకు అతడు వెనుదీస్తాడా! అతని ప్రవర్తన యేమని చెప్పాలి?

వరూథిని విరహవేదన ననుభవిస్తోంది. మన్మథుడు ఆమెమీద శరవర్షాన్ని కురిపిస్తున్నాడు. తత్తరపాటుతో మీదకురికి శివునికంటిచిచ్చుకు బూడిదై, కాలినమోడులాగా రతి కన్నీటి వానకు మళ్ళీ చిగురించాడు. విరహిణులను తపింపచేయడానికేనా! అప్పుడే చావకూడదో! రతి మంగళ సూత్రానిది యెంతటి మహిమో!

శివుడు నేత్రాగ్నిని కోపంతో వదిలినా ఆ అగ్ని అతణ్ణి దహించలేదు. కారణం! అతడుస్వాహాదేవిని ప్రేమిస్తున్నాడు. అబ్బ దేవుడుకూడా దుష్టులకే సహాయపడుతాడు!

లోకంలోవున్న చక్కదనాన్నంతా పోగుచేస్తే సృష్టి అయినవాడు మన్మథుడు. భోగి, పూవిలుకాడు. విరహుల మీద బాణాలు ప్రయోగించే నిష్ఠురత్వానికి రతిపయ్యెదకు నమ్మైన ఆ చేతులను యెట్లా సిద్ధపరచాడో!

వరూథిని విరహవేదన ననుభవిస్తోంది. పువ్వులమీద నుంచి పొడినీ, సువాసననూ లాక్కువచ్చి ఆమెను మరింత బాధపెడుతున్నది మలయమారుతం.

చంద్రునితోకూడి విరహులను భాధించడం అతనికి. తగునా! అగ్నితోకలిసి లోకాన్ని దహించే అతని కిదేపాటి? దుష్టుల స్వభావమే అది. అతణ్ణి భక్షించడానికే బ్రహ్మ సర్పానికి రెండు నాలుకలు కల్పించాడు. కాని విరహిజనుల దురదృష్టంవలన అది గాలినంతా తినెయ్యలేకపోతోంది.

వరూధిని మూర్ఛపడింది. సఖురాండ్రు ఆమెను సేద దీర్చారు. ముసలిశిల్పి ఆమెపక్కన కూర్చుని ఆమెకు సపర్యలు చేస్తున్నాడు. ఆమెకు తెలివివచ్చింది.

"ఇట్లా బాధపడడం నీ కనవసరం తల్లీ!" అన్నాడు.

వరూధిని కన్నీళ్ళు కార్చింది.

"మెరుగు బంగారంలాంటి ప్రేమను చూపవలసిన మన జాతికి చిన్నతనం తీసుకువస్తున్నావు యిట్లా ప్రవర్తించి. చూడు, అందరూ నవ్వుతున్నారు. ఇట్లా వెన్నెల్లో నీ శరీరాన్ని బాధపెట్టడం యేమీ బాగాలేదు." అంది ఊర్వశి.

"మీ జాతిలో తప్పిపుట్టింది" అన్నాడు తాత. వరూధినితల నిమురుతూ.

"నువ్వే దా నిట్లా పాడుచేశావు తాతా!" అంది రంభ. అందరూ నవ్వారు. తాత యేమీ మాట్లాడలేదు.

"అతడు రాడా తాతా?" అంది వరూధిని దీనంగా.

"మీరు వరూధిన్ని కొంచెం వూరడించండి అమ్మాయిలూ" అని లేచి లోపలికి వెళ్ళాడు శిల్పి.

"వరూధినీ! ఆడుదానికి యింత కనువేమరు వుంటే యెట్లాగే?" అంది శశిరేఖ.

"కొత్తగిత్త కాబట్టి. నువ్వు పైనబడేటప్పటికి బెదిరిపోయాడు. నిన్ను కాదనేవాడెవడే?" అంది హేమలత.

"వాడేం యిందుగ్రిడా చంద్రుడా? యెక్కడికి వెడుతాడే, యిక్కడే యెక్కడో తిరుగుతూ వుంటాడు. నీ యందం యెవ్వరికి వెర్రియెత్తించదే?" అంది ధాన్యమాలిని.

"అదిగో చంద్రుడు వెలవెలబోతున్నాడు. తెల్లవారబోతోంది. ఇంకా యిట్లా యేడుస్తూ కూర్చుంటే యెట్లా? అలంకరించుకోడానికి సిద్ధపడండి, ఉద్యానవనానికి వెడదాం" అంది హారిణి.

"అక్కడ తప్పకుండా కనుపిస్తాడు నీ ప్రియుడు..." అంది వరూధిని గెడ్డాన్ని ఆడిస్తూ ఊర్వశి.

వరూధిని మౌనంగా కూర్చుంది. కన్నీళ్ళు మాత్రం కారుస్తూనే వుంది. తనకు కనుపించిన ఒక వింతవస్తువు తనకు దక్కకుండాపోయింది.

# 20

నళినాక్షుడు యిటూ అటూ తిరుగుతున్నాడు. వరూధిని స్థితినిచూసిన అతనికి పిచ్చెత్తినట్టయిపోయింది. అతని ఆశలన్నీ నిరాశలై పోయినై. రతీదేవి తానుయిచ్చిన మాటప్రకారంగా వరూధిని హృదయాన్ని తనవైపుకు మళ్ళించి వుంటుందని అతడు అనుకుని ఆనాటి మధ్యాన్నం అక్కడికి వెళ్ళాడు. నిజంగానే ఆమెహృదయం మారిపోయిం

వనుకున్నాడు. మామిడిచెట్టుకింద పాలరాతి తిన్నెమీద కూర్చుని నాటరాగంతో వీణను పలికిస్తూ వరూధిని పాడు తుంటే వెనుక పొదరింటి చాటునుండి తన్మయుడై వింటున్నాడు.

"నా కింకా సాధనచాలదని మా అక్క నన్ను చీవాట్లు పెడుతుంది" అన్న శ్రీలేఖ మాటలు అతనికి జ్ఞాపకం వచ్చినై. నిజంగా వరూధిని వీణవాయించడంలో సరస్వతితో సమానురాలు.

"టక్ మని వీణ నిలిచిపోయింది. వీణ భగ్నమైందను కున్నాడు. కాదు, అతని హృదయమే భగ్నమైంది. ఆమె వీణను తిన్నెకు చేర్చి ఘల్లు ఘల్లుమనే అందెల చప్పుడుతో నడిచివెళ్ళి ఒక పోకచెట్టుదగ్గర నిలబడి దేన్నో చూస్తోంది. పొదరింటిచాటునుండే చూస్తున్నాడు నళినాక్షుడు.

వరూధినితోపాటు అతడుకూడా ఆశ్చర్యంతో చూస్తు న్నాడు. ప్రవరుని స్వరూపాన్ని చూసి అతడు చకితుడైనాడు. అతడు వరూధిని ప్రవర్తనను గమనిస్తూనేవున్నాడు. ప్రవరుని నిశ్చలత్వం, పరకామినీ విముఖత్వం నళినాక్షునికి అతనిమీద ఒక గౌరవాన్ని కలిగించింది.

ప్రవరుడు మహానుభావుడు. కాని వరూధిని— కళ కోసం, కళారాధకులకోసం తన జీవితాన్ని గడుపుతానని ప్రతిజ్ఞచేసిన వరూధిని— వేశ్యాకులంలో పుట్టినా, వ్యక్తి గతంగా నీతులూ నియమాలూ పాటించే వరూధిని— తనకు

పుత్రికతో సమానురాలనీ, తనను కామించడం న్యాయం
గాదనీ ధర్మోపదేశం చేసిన— ఆ వరూధిని— "తల్లీ!" అని
సంబోధిస్తున్న పరమపవిత్ర హృదయుణ్ణి ప్రవరుణ్ణి—
నీచురాలై—.



వరూధినిని నిందించడంలో అర్థంలేదు. ఆమె అబల
స్త్రీ. ప్రవరుడు త్రిజగన్మోహనాకారుడు. పురుషుడైన తనకే
అతణ్ణి, అతని యెత్తైన వక్షాన్ని; దీర్ఘమై కండలు తిరిగిన
బాహువుల్ని చూచి— మనస్సు చలించింది— తను వొక
స్త్రీగా పుట్టి అతని కౌగిట్లో నలిగిపోవాలని—



ఇన్ని రోజులూ యేమీ యెరుగనట్టు నటించిన
వరూధిని యెన్నిమాయలు పచరించింది! అతణ్ణి వశపరుచుకో
డానికి యెన్ని టక్కులు, యెన్ని జాలాలు చూపుతోంది!
కాని అతడు లోబడ్డాడా?

ఎక్కణ్ణుంచి వచ్చిందా తేజస్సు? తను తాళుకోలేక
పోయాడు. కళ్ళు చీకట్లు కమ్మనై. కళ్ళువిప్పి చూశాడు.
ప్రవరుడు లేడు. యెక్కడికి వెళ్ళాడో! యెట్లా వెళ్ళాడో!
వరూధిని మూర్ఛపడివుంది.

ఆమెను తన చేతుల్లో యెత్తుకుని యింట్లోకి తీసుకు
వెళ్ళబోయాడు. ముసలిశిల్పి వచ్చాడు. రామేశ్వరయాత్ర
నుండి అతడు తిరిగి అప్పుడే వచ్చాడు. ముసలిశిల్పి తనను
యేదో అనుమానిస్తూ చూశాడు.

వరూధిని మనస్సు ప్రవరునిమీద లగ్నమైపోయింది.
అతనిమీదనుంచి ఆమె మనస్సును మరలించడం కష్టం.

ఆమెస్థితిని చూసి నళినాక్షునికి పిచ్చియెత్తినట్లయి పోయింది. అతని ఆశలన్నీ నిరాశలై పోయినై. అతడు యింటికివచ్చి ఆవేదనపడుతున్న హృదయంతో యిటూ అటూ పచార్లు చేస్తున్నాడు.

శ్రీలేఖ వచ్చింది. కాలి బొటనవ్రేలుతో నేల గీకుతూ నిలబడింది. ఆమెవంక చూశాడు నళినాక్షుడు. ఆమెలో మునుపువున్న వికాసం లేదు. కళ్ళు లోపలికి దించుకు పోయినవి. సంస్కారంలేక వెంట్రుకలు రేగివున్నై. శరీరం కృశించిపోతోంది.

నళినాక్షునికి జాలికలిగింది.

"శ్రీలేఖా!" అన్నాడు. చాలారోజులకు యివ్వాళ పిలిచాడు. శ్రీలేఖ ముఖాన్ని చెరగుతో కప్పుకుంది. దుఃఖ ప్రవాహం కట్టలు తెంపుకుని వచ్చేసింది.

నళినాక్షుడు మళ్ళీ యిటూఅటూ పచారుచేస్తున్నాడు.

"మీరు యింకా యెంతకాలం యిట్లా ప్రవర్తిస్తారు?" అంది డగ్గుత్తికతో.

అత డేమీ మాట్లాడలేదు.

"మీరు మీమనస్సును కుదుటపర్చుకోవాలి..."

"ప్రయత్నిస్తాను"

"నావల్ల యేదైనా తప్పువుంటే—"

"శ్రీలేఖా! నన్ను కొంతకాలం యేకాంతంగా వుండనివ్వు" అన్నాడు.

శ్రీలేఖ యేమీ మాట్లాడలేదు. కన్నీళ్ళు తుడుచుకుంటూ అక్కణ్ణుంచి వెళ్ళిపోయింది.

నళినాక్షుడు నిట్టూర్పు విడిచాడు. తనకు వరూధిని లభించలేదు. యింక లభించదు. ఛీ! అటువంటి సుందరాంగిని అనుభవించని తనజన్మ యెందుకు? ఇంక రతీదేవి తనకు సహాయం చేయలేదు. ఆమె చేతుల్లో యేమీలేదు. ఆమె భర్త వరూధిని మనస్సును మరొక్కరిమీద లగ్నంచేశాడు.

శృతిపెట్టి పాలరాతి తిన్నెకు చేర్చబడ్డ వరూధిని వీణ అతనికి జ్ఞాపకం వచ్చింది. ప్రవరుడు, పాలరాతి తిన్నె, వరూధిని వీణ! సంగీతజ్ఞానంవున్న తనచేతిలో వుంటే బాగా మీటగలడు.

ఇంక తనకు వరూధిని లభించదు. ఆమె కౌగిలికి తాను చాలా దూరం అయిపోయాడు.

పెద్దగా నవ్వు వినిపించింది. ఆ నవ్వు తాను యిదివరకు యెన్నడూ వినలేదు. శిల్పి వచ్చాడనుకున్నాడు. కాదు—తిరిగి చూశాడు— మన్మథుడు! పుష్పాలంకృతుడై చెఱకు విల్లును చేతితో పట్టుకుని నిలబడ్డాడు.

నళినాక్షుడు ఆశ్చర్యంతో అతణ్ణి లోపలికి ఆహ్వానించాడు.

"నళినాక్షా!" అన్నాడు మన్మథుడు.

"... ... ..."

"నీ హృదయం పరితపిస్తోంది కదూ?"

"అదంతా నీ లీల—"

"పొరపాటు పడుతున్నావు. నాలీల కాదు. "కాలం" యొక్క లీల. అతని ఆజ్ఞలేనిదే నేనేమీ చేయలేను."

"నామీద యిప్పుడు నీ కేదో అకారణ వాత్సల్యం కలిగివుండాలి. వరూధిని నాకు దక్కకుండా చేశావు."

మన్మధుడు నవ్వాడు "వరూధిని నిన్ను, నీ స్వరూపాన్ని వరించదు. కాలం ఆజ్ఞ అది. కాని నీకు ఆమె పొందు వుంది."

నళినాక్షుడు మన్మధునివంక చూశాడు. అతనికేమీ అర్థంకాలేదు.

"నీకు ఆశ్చర్యంగా వుండవచ్చు నళినాక్షా! నేను నిజంచెబుతున్నా. అందుకొరకే నేను స్వయంగా రావలసి వచ్చింది."

"వరూధిని ప్రవరుణ్ణి వలచింది." అన్నాడు నిస్పృహతో.

"కాని ప్రవరుడు ఆమెకు లభించడు. కాలం ఆజ్ఞ లేదు."

"మరి—?"

"నీవు ఆ స్వరూపాన్ని పొందాలి. శాంబరి ప్రయోగించి..."

"మన్మధా!" అన్నాడు గట్టిగా.

"అంతే నళినాక్షా! ఆమెను పొందడానికి అంతకంటే నీకు గత్యంతరంలేదు. కాని జాగ్రత్త!"

మన్మథుడు వెళ్ళిపోయాడు. నళినాక్షుడు అతడు వెళ్ళిన దారివంకనే చూస్తూ నిలబడిపోయాడు. అతని హృదయంలో యేదో కదిలింది. తనకు వరూథిని కావాలి. ఆమె సన్నని నడుముచుట్టూ తనహస్తాన్ని పోనిచ్చి తనహృదయానికి ఆమెను హత్తుకోవాలి— ఇటూ అటూ పచార్లుచేస్తూ వున్నాడు. వెలవెలబోయిన ముఖంతో చంద్రుడు పశ్చిమాద్రిని చేరబోయాడు.

# 21

ఉషఃకన్య తన తేజోహస్తములతో చీకటితెరలను మెల్లిగా తొలగించింది. దరవికస్వరకమలబహిర్గత భ్రమర శ్రేణి శ్రావ్యంగా "ఝుంకారం" చేస్తూ ప్రభాతగీతికలు పాడుతోంది.

చిత్ర విచిత్రమైన వస్త్రములతో, ఆభరణాలతో అలంకరించుకున్నారు అచ్చరకన్నెలందరూ—

వరూథిని ముఖం యేడ్చి యేడ్చి బాగా వుబ్బిపోయి వుంది. అందరూ ఆమెను బలవంత పెడుతున్నారు వనవిహారానికి రమ్మని.

గుమగుమలాడుతున్న పచ్చకప్పూరం కలిపిన గంధం తీసుకువచ్చి యిచ్చింది హారిణి. వరూథిని వేలుతో ముట్టి చుక్క పెట్టుకుంది. అంతే.

పూలగుత్తులు తెచ్చి అందివ్వబోయింది పుంజికస్థల. విసుక్కుంటూ కొన్ని విరులు తుఱుముకుంది కొప్పులో.

రత్నఖచిత పాదుకలను తొడుగబోయింది రత్నాంగి. తొడుక్కోకుండానే అడుగు బయటకుపెట్టింది వరూధిని.

వాసన వక్కపొడిని వనజాక్షి అందిస్తే, యెక్కువైందని కొంత వుమ్మేసింది సగం నములుతూన్న ఆకులతో. చెలికత్తెలు పిలుస్తుంటే సగం తెలివితో, సగం మరుపుతో విచారంతో సగమైపోతూ వారి వెంట బయలు దేరింది వరూధిని వుద్యాన వనానికి. ఆమె అందెల చప్పుడుకు ఆకర్షింపబడి రాజహంసలుకూడా కొన్ని ఆమెవెంట నడచినై.

అందరూ వుద్యానవనంలో ప్రవేశించారు. ఆ వనం యొక్క అతిశయాన్ని సామాన్య మాటలతో చెప్పలేము. మలయ పర్వతంలో సర్పఫూత్కారాలతో ఘాటెక్కిన తన వాసనను విడచి చల్లగా, హాయిగా వీచగలదు యీ వనానికి వచ్చిన మలయమారుతం. ఇక్కడి తుమ్మెదల పాటలు విని, శివుని పెడబొబ్బలకు యెక్కిన తలదిమ్మును వదిలించుకోగలడు మన్మథుడు. వేసవి పరివేశించడం వల్ల తనకు కలిగే వుబ్బరాన్ని వసంతుడు ఈ చెట్లనీడక్రింద పోగొట్టుకోగలడు. కాలకూట సహోదరత్వం వల్ల తన కిరణాలకు కలిగిన కటుత్వాన్ని యిక్కడిపూదేనెచేత పోగొట్టుకోగలడు చంద్రుడు అన్నట్టుగా పెరిగివున్నై పనస, తినిశ, చంప, కురువక, నిచుల, వంజుల, దాడిమ, విచికిల, ఆమ్రి, పాటలి, పూగ, కేసర మొదలైన వృక్షములు.

పద్మాలనుండి రాలిన పొడిచేత పసుపెక్కిన నీటిఅలలు ఒకదానివెనుక ఒకటి వచ్చి కొలనుగట్టునవున్న పాలరాతి మెట్లమీద విచిత్రంగా మోదుతూవుంటే వాటిమీదనే గల్లు గల్లుమనే అందెలచప్పుడుతో తమ కిలకిలనవ్వులు కలిపి నవు స్తున్నారు అచ్చరులు.

మామిడి చెట్టుమీద బాగా పూచినకొమ్మమీద కూర్చుని "కుహూ" అని కూస్తున్న కోకిల వసేందిరస్తన చూచుకంలా కనుపిస్తే ఊర్వశి తనలోతాను నవ్వుకుని అంప రికీ చూపింది.

వనదేవతల యిండ్ల దీపశిఖలను చూసిన చీకట్లలా పారిపోతున్నై సంపంగి పువ్వులను చూసిన తుమ్మెదబారులు.

"అదిగో రంభ, తపసిని సిగురాకు చేతులతో అను రాగసుమనోలాలసమై యెట్లా కౌగలించుకుంటోందో!" అంది అగిసెచెట్టుమీదకు గెలబరువుకు వాలిన అరటిచెట్టునుచూసి హేమ.

"రంభ తపసిని కౌగలించుకోడం అబ్బురమా?" అంది సుకేసి.

రంభ నవ్వింది. అందరూ నవ్వారు. వరూధినిమాత్రం నవ్వలేదు. నడవలేక నడవలేక వారివెంట నడుస్తోంది.

పండుటాకులమీద రాలిన తెల్లని యిప్పపూలు, తామ్రపర్ణీతటంలో కొల్లలుగా పడివున్న ముత్తెపుచిప్పల్లోని ముత్యాల్లా వున్నై. అందరూ వింతగా చూశారు. తన

సైన్యాన్ని విరహులమీదకు కోపంతో పంపడానికి ఆజ్ఞ యిస్తున్న మన్మథునిహస్తంలా కదిలింది అశోకవృక్షపుచిగు రాకు. దాన్ని వరూధినికి చూపింది ధాన్యమాలిని. వరూధిని చూసినా చూడనట్టేలెక్క.

అందరూ పుష్పాచయంచేస్తున్నారు. వరూధిని వొక్క పువ్వుకూడా గిల్లలేదు. ఒక్కపువ్వు వాసన చూడలేదు. ఒక్కటంటే వొక్కటికూడా తలలోతురుముకోలేదు. ఊర్వశి మొదటకోసినపువ్వును తలలో ముడుచుకుంది. మన్మథునికి అర్పించలేదు. "యెంతగర్వమే నీకు?" అంది తిలోత్తమ. పూవిలుకానికి వొకపూవు అర్పిస్తూ.

పావురముల ఆరజము వరూధినిహృదయాన్ని మరింత కలతబెడుతోంది. శశిరేఖ దాన్ని యింపుగా వింటూ నిల బడింది.

ఒకరితోవొకరు సరసమాడుకుంటూ ఆ తోటలో ముందరికి నడచివెళ్ళారు. "జలక్రీడలాడుదామే" అంది రంభ. తామరతూండ్లతో మత్తెక్కిన రాజహంసలకూతలతో 'ఝుం' అని రొదలుచేస్తున్న తుమ్మెదలతో నిండిన కొలనునుచూసి.

అందరూ సరేనన్నారు. ఒకరివెంటవొకరు పమిటలతో చనుకట్లు బిగించి, అందులోదిగి జలక్రీడలారంభించారు.

వరూధిని గట్టుమీదనే కూర్చుంది. వాడిపోయిన ముఖ కమలంతో, చేతితోనొసటిని పట్టుకుని, "రారమ్మ"ని పిలు స్తున్న చెలికత్తెలకు వొకచేత్తో నమస్కారంచేస్తూ, యేమి

త్రోచకుండా మాటిమాటికీ పరధ్యాన్నంతో దిక్కులుచూస్తూ కూర్చుంది.

వరూధిని దిక్కులుచూస్తూనేవుంది. దూరాన సూర్యుని కిరణాలకు తళతళమెరుస్తూ కొలనుపైనుంచివచ్చే గాలికి సుళ్ళుతిరుగుతూన్న పుష్పొడిమధ్య యెవరో కనుపించారు. రెప్పలల్లార్చి చూసింది. కలలోకాన్పించిన వస్తువు మేలుకోగా కనుపించినట్టు విస్తుపోయి చూసింది.

ప్రవరుడేనా! ప్రవరుడే. నిశ్చయంగా ప్రవరుడు. ఇంటి దారి తెలియక, ఆ అడవిలోనే తిరుగుతున్నాడు. బంగారు తోరంగట్టిన ఆ బాహువుల్ని యెత్తి యెలుగెత్తి జట చెప్తున్నది అతడే! తనశరీర కాంతితో ఆ వనాన్ని అలుకుతున్నది అతడే తనకు దక్కడనుకుని ఆశవదులుకున్న ప్రవరుడే అతడు!

నీళ్ళలో తాము యెంతసేపువుండగలమో, యెవరు యెక్కువకాలం వుండగలరో అని పోటీలుపడి లోపల మునిగివున్నారు, జలక్రీడలాడుతున్న అచ్చరలంతా.

వరూధిని మెల్లిగా లేచింది. పొదరిండ్లచాటున దాక్కుంటూ, నక్కుతూ నక్కుతూ, మేఘాలచాటున పరుగెత్తే మెరుపులా వెళ్ళింది. కన్నీళ్ళతో ఆకులమై, యెఱ్ఱగావున్న ఆమె కొసచూపులు కోపంతో తమ్మిరసం అంటుకునేట్టుగా కరచివేసిన మన్మథునిబాణాల్లా వున్నై.

మొట్టమొదట అతన్ని చూసినప్పుడు వరూధిని చూపులు చలించినై. రెండుమూడడుగులు ముందుకువేసేటప్పు

టికి ఆమెకాళ్ళు తొట్రుపడినై. ఇంక కొంత ముందుకు వెళ్ళేటప్పటికి ఆమెముఖంలో దీనత్వం ఆవరించింది. పిలవా లనిపించింది. ఆమెకు దగ్గుత్తికపడింది. వెనుకనుండి వెళ్ళి అతని అంగవస్త్రాన్ని పట్టుకుంది. ఆమెకు చెమటలుపట్టినై.

అతడు తిరిగిచూశాడు. తలవంచుకుని నిలబడ్డాడు. వరూథినికళ్ళల్లో నీళ్ళుతిరిగినై. "ఇట్లా నీ మనసు రాయిచేసు కుంటే, నేను చేసేదేమీ లేదు. నా అదృష్టం యిలావుండగా నిన్నని యేం ప్రయోజనం?" అంది.

అతడు కాలిబొటనవ్రేలుతో నేలగీకుతున్నాడు.

"ఈ కోపమెందుకు నీకు? నీకోసం యెదురుచూస్తున్న నన్ను కూడి, చల్లని వెన్నెలరాత్రులలో, ఈ మల్లెపొద లలో సుఖించలేవా! నీకోసం రాత్రంతా కన్నీళ్ళుకారుస్తూ గడిపాను. మన్మథ భాణాగ్నికి గురి అయ్యాను. నిన్ను దక్కించుకో లేకపోయాను. నీవు యిష్టపడకపోతే, నీతో యిందుకోసం హోరాహోరిగా పోరాడలేను. చావో దానికి మించినది యింకేదో దాన్నే పొందుతాను" అంది దీనంగా.

అతడు హృదయంలో పొంగుతున్నదాన్ని దేన్నో అణచుకోవడానికి ప్రయత్నిస్తున్నట్టు కనబడ్డాడు. సన్నగా యెంతో దీనంగా మాట్లాడాడు.

"ఇల్లూ వాకిలీ, తల్లీతండ్రీ అంతా దూరమైపోగా నాఅన్న వారు లేకుండా యీ అడవిలో అల్లాడుతున్న నేను యేవిధంగా నీతో సుఖించను చెప్పు? నీకౌగిలిలో లభించే

సుఖం ఆ యింద్రునికైనా లభిస్తుందా! వొద్దంటూ పెనగు లాడుటకు నే నేం సన్యాసినా? మనసు తిన్నగా లేనప్పుడు అన్నీ అసహ్యంగానే వుంటాయి." అన్నాడు.

వరూధిని హృదయంలో కమ్మిన నిరాశామేఘాలు మెల్లిమెల్లిగా మటుమాయం కాసాగినవి.

"నీ దైన్యం నేను చూడలేకపోతున్నాను. నీకోసం సర్వం వదిలిపెట్టేస్తాను. పరులకు వుపకారం చేయడంకంటే వేరే ధర్మంలేదు." అన్నాడు మళ్లీ.

వరూధిని ముఖకమలం చిరునవ్వుతో వికసించింది. ఆమెవొళ్ళు పులకరించింది.

"కాని, నీ వొక మర్యాదకు వొప్పుకోవాలి. మన యిద్దరి సంగమకాలంలో నీవు కన్నులు మూసుకోవాలి." అన్నాడు.

వరూధిని సిగ్గుతో తలవంచుకుంది.

"మరి యే మానవుడు యిక్కడ వుండకూడదు. ఈ మర్యాదకు నీవు అంగీకరించితే సరి, లేకపోతే యింక నేను యెట్లాగూ యిల్లు చేరలేను. ఈ గంగానదీ తీరంలో యీ వనప్రదేశంలో తపస్సుచేసి మోక్షాన్నైనా పొందుతాను." అన్నాడు.

వరూధినికి వొక్కసారిగా అతణ్ణి కౌగలించుకోవాలని పించింది. ఆమె ఆనందం పట్టపగ్గాలు లేకుండా వున్నది.

"ఇంత యెందుకు చెబుతున్నానంటే, నేనో పరదేశిని. నీకోసం వ్రతాదులవల్ల లభించేపుణ్యాన్ని పోగొట్టుకుంటు

న్నాను. నీ కోరిక తీరగానే నన్ను వెళ్ళిపొమ్మంటే, రెంటికీ చెడిన చాకలిలా అవుతుంది నాపని" అన్నాడు మళ్ళీ.

"ప్రవరా! నిన్ను నేను విడిచిపెట్టగలనటోయి? మృత్యువుకూడా మనల్ని విడదీయలేదు." అంది అతని కళ్ళలోకి చూస్తూ.

ఆమె నిలువలేకపోయింది. అతని కౌగిట్లో వాలిపోయింది.

"అమ్మదొంగా! యిక్కడున్నావా?" అంది ఊర్వశి కంఠం. వరూధిని దూరంగా తొలగి నిలబడింది. అచ్చరలంతా తడిచీరలతో గుంపుగా వచ్చారు. వరూధినీ ప్రవరులు సిగ్గుతో తలవంచుకుని నిలబడ్డారు.

"ఎంత నిర్దయుడవోయి!" అంది ఊర్వశి.

"మా వరూధినిని కాదని" వెళ్ళడమే! అంది రంభ. అందరూ నవ్వారు. అతనిచుట్టూ మూగి, అతన్ని పరిహాసా లాడారు. ఊర్వశి కనుసౌంజ్ఞ చేస్తే వొక్కొక్కరే తప్పుకున్నారు అక్కడినుండి కొంతసేపటికి.

వరూధినీ ప్రవరులు వొకరినొకరు చూసుకుంటూ నిలబడిపోయారు కొంతసేపు. మామిడిచిగుళ్ళ చాటునుండి కోకిల "కుహూ" అని పాడింది.

## 22

శ్రీలేఖహృదయం విచారభారంతో నానాటికీ దించుకు పోతోంది. నళినాక్షుని హృదయాన్ని వరూధినీ విముఖం చేయాలని ఆమె ప్రయత్నించింది. అతనితో యెన్నెన్నో చెప్పాలనుకుంటుంది కాని, అతని ముందరికి వెళ్ళినప్పుడు తనకు యేడ్పుతప్ప మరేదీ వచ్చేదికాదు.

"నీవు చాలా అందంగా వుంటావు శ్రీలేఖా!—" అని తొలినాడు నళినాక్షుడు తననుకౌగిట్లో వుంచుకుని చెప్పిన మాటలు ఆమెకు జ్ఞాపకం వచ్చినై. అప్పుడు తనహృదయం యెట్లాపొంగింది? నిజంగా తనఅంత అందమైనస్త్రీ మరొక్కతె పుట్టివుండదని తాను గర్వపడింది. నళినాక్షుని హృదయం తనకే అర్పితమైందనుకున్నది.

తనఅక్క శిలావిగ్రహాలను చూస్తూ "నేనూ యెంత మంది స్త్రీలనో చూశాను. చిట్టచివరకు నన్నాకర్షించింది నీ అందం. కాని యీ విగ్రహాలముందు నీవుకూడా శోభించడం లేదు." అన్న నళినాక్షుని మాటలకు "మీ మాటల్లో అతిశయోక్తి లేదు. ఆమె స్త్రీలనే మోహింపజేస్తుంది" అని తాను బదులుపలికింది. అతడు కళాదృష్టితో అలా అన్నా డనుకుంది. అతని మాటలవెనుక దాగివున్న ఆ కామ వికారాన్ని తాను చూడలేదు. నళినాక్షుని హృదయంనిండా కామమే వుంది. అతని చూపుల్లోనూ కామమేవుంది. అతడు

స్త్రీలను కాముక దృష్టితోనే చూస్తాడు. అతనికి ప్రేమ తెలియదు. తనను ప్రేమించిన స్త్రీలను అతడు సుఖపెట్టలేడు. అతణ్ణి ప్రేమించడం, అతనికోసం యిట్లాతపించడం తనదేతప్పు.

నళినాక్షుడు అందమైన ఆడవాళ్ళను కేవలం తన కామతృప్తికోసం వుపయోగించుకుంటాడు. అతనికి యెవరినీ స్థిరంగా ప్రేమించే హృదయం లేదు. ఇది చిత్రలేఖ నొక్కి నొక్కి తనతో ఆనాడు పలికిన ఉపదేశం. నేడు నిజమైంది. ఆమాటలు జ్ఞప్తికివచ్చి "చిత్రా!—" అని అరచింది గట్టిగా. చిత్రలేఖకు యెట్లా తెలిసింది యీ సంగతి?— తను అతణ్ణి ప్రేమించి బాధపడుతానని. ఆమె యెట్లా వూహించుకోగలిగింది? తను అప్పుడే ఎందుకు జాగ్రత్తపడలేదు? ఆనాటి అతని గాఢపరిష్వంగంలో వేడినిట్టూర్పుల్లో స్వర్గంతో పాటు చిత్రలేఖ చేసిన వుపదేశంకూడా మరిచిపోయింది.

ఇప్పుడు నళినాక్షుడు యింటిదగ్గర లేడు. ఎక్కడికి వెళ్ళాడో! అతని రాకకోసం యెదురుచూసి చూసి ఆమె కన్నులు వాచిపోయినై. ఎన్ని రోజులైంది అతడు తనకు కనబడి?

వరూధిని దగ్గరకు ఆనాడు వెళ్ళటమే మళ్ళీ వెళ్ళలేదు. వెళ్ళడాని కామెమనస్సు అంగీకరించలేదు. ఆమెకూడా తనయింటికి రావడంలేదు.

నళినాక్షుని జాడలేదు. నెలలు గడుస్తున్నవి. ఎక్కడికి వెళ్ళాడు? వరూధిని అంగీకరించిందా? అతని కామానికి లోబడిపోయిందా? ఇంక తన కేమిటి గతి?

ఆమెహృదయంలో యేదో చెప్పరాని ఆవేదనకలిగింది.

తనఅక్క కళకోసం కళారాధకులకోసం తనజీవితాన్ని గడుపుతానని ప్రతిజ్ఞ పట్టిన తనఅక్క యేదో సామెత చెప్పి నట్టు, చివరకు తుచ్ఛమైన కామానికి లొంగిపోయి, తనకు ద్రోహం చేస్తోందా? ఆమె నమ్మలేకపోయింది. ఎన్ని విధాలుగా తలపోసినా ఆమె నమ్మలేకపోయింది. ఆమె హృదయం తనకు తెలుసు, నళినాక్షునికి తాను వశురాలైనా, తనను నళినాక్షునినుండి ఆమె యెన్నడూ విడదీయలేదు.

మరి నళినాక్షుడు యెక్కడికి వెళ్ళినట్టు? పిచ్చియెత్తి యే అడవిలోకన్నా వెళ్ళిపోయాడా? ఆమెహృదయం భయ పడింది. కామంతో మతి భ్రమచెందినవారి కథలు తను చాలా విన్నది. నిజంగా అంతే అయివుండాలి. ఇన్ని రోజులు తను అతణ్ణి అన్వేషించకుండా యెందుకు వూరుకుంది? ఏమో! "నన్ను కొంతకాలం ఏకాంతంగా ఉండనివ్వు శ్రీలేఖా!" అని అతడు జాలిగా అంటే, అతనియేకాంతవాసానికి అంతరాయం కలిగించకూడదనుకుంది తను. కళారాధకుల మనస్తత్వం "నీకు తెలియదు" అన్న వరూధిని వుపదేశాన్ని తను ఆచరణలో పెట్టింది.

ఫలితం! అతడు తనకు కనబడకుండానే పోయినాడు.

అతనికి యెవరినీ స్థిరంగా ప్రేమించే హృదయం లేదు. తన అక్క లభించినా, ఆమెకుకూడా యీగతే పడుతుంది! చిత్రలేఖ అతని స్వభావాన్ని యెంత అనుభవం వున్నట్టు

చెప్పింది! ఆమె కెట్లా తెలిసిందో! ఆమె హెచ్చరిస్తే తాను జాగ్రత్తపడలేకపోయింది. అనుభవిస్తోంది!

చిత్రలేఖనుచూడాలనిపించింది. ఆమెనుకౌగలించుకుని గుండెలోని బరువంతా దిగిపోయేటట్టు గట్టిగా యేడవాలని పించింది. తాను అలకానగరానికి వచ్చినతరువాత చిత్ర లేఖను చూడనేలేదు— ఆమెకూడా రాలేదు.

శ్రీలేఖ అమరావతికి ప్రయాణమైంది. ఆనాడు నళినాక్షుని తొలికౌగిలివల్ల కలిగిన వొక మధురానుభవంతో వొక నూతనోత్సాహంతో, పుష్పసముజ్వలమైన వసంత శోభతో అమరావతికి వెళ్ళిన శ్రీలేఖ, ఈనాడు అతని కౌగిలికి దూరమై, దుఃఖభారమైన హృదయంతో, దీన వదనంతో ఆ అమరావతిలో అడుగుపెట్టింది. అమరావతి ఆనాడు వున్నట్టుగానేవుంది. తనే మారిపోయింది. అమరావతి శోభ అట్లాగే వుంది. తనముఖంలోనే శోభ తగ్గిపోయింది.

చిత్రలేఖ యింటికి వెళ్ళింది. చిత్రలేఖ కుండలకు రంగులు వేస్తోంది. అపనిలో అమరావతిలో ఆమెది అందె వేసిన చెయ్యి. మిన్నేటి బంగారు బంకమట్టితో చేసిన పాత్రలకు యెంతో శ్రద్ధగా చిత్రవిచిత్రంగా చూడముచ్చటగా రంగులు వేస్తుంది. వైజయంతంలో చాలమట్టుకు చిత్రలేఖ పనితనంచూసి రంగులువేసిన మట్టిపాత్రలనే వాడుకుంటారు. ఒక్క వైజయంతంలోనే కాదు, అమరావతిలో చాలామంది ఆమె రంగులువేసిన పాత్రలనే వాడుకోడానికి కుతూహల పడుతుంటారు. ఆమె తనపేరును సార్థకం చేసుకుంది.

పనిలో లీనమైన చిత్రలేఖ పరధ్యానంగా తలపైకెత్తి చూసింది. ఆమె కుర్చీకను చేతితో పట్టుకుని అట్లాగే ఆశ్చర్యంగా చూసింది.

శ్రీలేఖ నిలబడివుంది. శ్రీలేఖ- ఉషఃకన్యలా యెప్పుడూ కలకలలాడుతూండే శ్రీలేఖ- వసంత సుమంలా నవనవలాడుతూండే శ్రీలేఖ- యిప్పుడు గుర్తుపట్టలేకుండా యెట్లా మారి పోయింది! నళినాక్షుడు ఆమెను పీల్చి పిప్పిచేశాడు.

"శ్రీలేఖా!" అంది నివ్వెరపోయిన చూపులతో చిత్రలేఖ.

"చిత్రా!" అంటూ పరుగెత్తుకుంటూవచ్చి కౌగలించుకుంది శ్రీలేఖ. పసిబిడ్డలా బావురుమంది.

"ఎట్లా మారిపోయావు శ్రీలేఖా!" అంది ఆమెను తనహృదయానికి హత్తుకుంటూ. శ్రీలేఖ వెక్కి-వెక్కి-యేడ్చింది.

"చిత్రా! ఆయన నన్నిప్పుడు ప్రేమించడంలేదు-"

"నాకు తెలుసు నీ కీ స్థితివస్తుందని- అతనికి యెవరినీ స్థిరంగా ప్రేమించే హృదయం లేదు-" అంది చిత్ర.

"అతనిమన స్సిప్పుడు మా అక్కమీదికి తిరిగింది. ఆమెకోసం పరితపిస్తున్నాడు- పిచ్చివాడిలా అయిపోయినాడు ఆమెకోసం."

"వరూధిని తెలివితక్కువది కాదు— ఇతని పిచ్చి చేష్టలు ఆమెదగ్గర సాగవు—"

"చిత్రా—" అంది శ్రీలేఖ డగ్గుత్తికతో.

"అతడు మళ్ళీ నావాడు కాడా ?" అని అడిగింది.

"పెర్రిపిల్లా ! నిన్నుచూస్తే నాకు జాలివేస్తోంది. అతని స్వభావం నీకు తెలియదు. అతని కామతృప్తికోసమే అతనికి ఆడవాళ్ళు కావాలి" అంది చిత్రి.

"అతని స్వభావాన్ని నీ వెట్లా తెలుసుకోగలిగావు చిత్రా! ఆనాటి నీ వుపదేశం నేడునాకు అనుభవానికివచ్చింది"

చిత్రలేఖ కళ్ళల్లో నీళ్ళు తిరిగినై. ముఖాన్ని పక్కకు తిప్పుకుంది. 'అనుభవం శ్రీలేఖా!' అంది గద్గదికమైనకంఠంతో.

"అనుభవమా ?" అంది శ్రీలేఖ ఆమె మాటల్లో తనకు నమ్మకంలేనట్టు.

"అవును శ్రీలేఖా— అనుభవమే— ఆ కథంతా నీతో చెప్పి అసలే బాధపడుతూన్న నీ హృదయాన్ని మరింత నొప్పించలేను."

శ్రీలేఖ తనకు యేమీ అర్థంకానట్టు చూసింది.

"అతనిముఖం యింక చూడకూడదని ప్రతిజ్ఞ పట్టాను. అతడు అమరావతిలో వున్నప్పుడు అతనికి కనపడడం నీ వెప్పుడైనా చూశావా ?" అంది.

"నీ మాటలు నాకు అర్థంకావడంలేదు చిత్రా"

"అర్థంకాదు, చిత్ర తన హృదయంలో తాను అనుభవిస్తున్న బాధ యెవ్వరికీ అర్థంకాదు. వేశ్యాకులంలో పుట్టినా ఒకరికోసమే బాధపడాలని మననొసట రాసిపెట్టివుంది."

శ్రీలేఖ చెవులప్పగించి వింటోంది.

"ఈ రంగులువేయడం, చిత్రవిచిత్రంగా కుండలకు రంగులువేసి అందర్నీ ఆకర్షించడం అతడు నేర్పిందే. కుబేరుని అంతఃపురంలో అతని పనితనం చూసి, అతనిదగ్గర చిత్రలేఖనం నేర్చుకోడానికి వెళ్ళాను. తొలిరోజుల్లో యెంత లాలనగా నేర్పేవాడు! యెంత తియ్యగా మాట్లాడేవాడు! నాలాంటి సుందరిని యెవర్నీ తాను యిదివరకు చూడలేదని యెంతయిదిగా నన్ను మెచ్చుకునేవాడు! నన్నుతప్ప మరెవర్నీ ప్రేమించనని యెన్నిసార్లు హృదయానికి హత్తుకుని చుంబన వర్షం కురిపిస్తూ మాట్లాడేవాడు— అంతా— రానురాను— క్రమంగా— కుబేరుని సభలో నాట్యకత్తెగావున్న మంజుల వాణిని చూసిననాటినుండి తగ్గిపోతూవచ్చింది. నన్ను తాకడం మానుకున్నాడు. చిత్రలేఖనం నేర్పడం మానుకున్నాడు. క్రమంగా మాట్లాడ్డంకూడా మానుకున్నాడు. నాకోరికలను ఆకాశంవరకు తీసుకుపోయి ఆధారం లేకుండా వదిలిపెట్టేశాడు. తరువాత తరువాత నన్ను చూడడమే అతనికి అసహ్యంగా వున్నట్టు తోచింది - నాకు రోషంవచ్చింది - అవమానంగా తోచింది— యేమీ చెయ్యలేక వచ్చేశాను. అతని ముఖమే చూడకూడదని వొట్టుపెట్టుకున్నాను. కాని, ఈ రంగులు వేస్తూవుంటే— ఇందులోని పనితనం చూసి అందరూ మెచ్చు కుంటూవుంటే అనుకోకుండానే నా మనస్సు అతనిమీదకు పరుగెడుతుంది——" చిత్రలేఖ పెద్దగా నిట్టూర్చింది.

శ్రీలేఖ తలమీద పిడుగుపడినట్లైంది. ఆమెకళ్ళు చీకట్లు కమ్మినై. తానేం విన్నదో, యెక్కడ నిలబడివుందో ఆమెకే తెలియడంలేదు.

"శ్రీలేఖా!" అంది చిత్ర ఆమెతల నిమురుతూ. "నీ మనస్సుకు మరింత నొప్పి కలిగించినందుకు నన్ను క్షమించు. గుండెలో కుమిలిపోతున్న దాన్ని భరించలేక నీతో చెప్పాను— నీవు భయపడకు శ్రీలేఖా! నీదారికి నేను యెప్పుడూ అడ్డురాను. అతడునాకు అక్కరలే దింక. నామనస్సు విరిగిపోయింది. మళ్ళీ అది అతుకదు. అతికించడానికి ప్రయత్నించను కూడా!" అంది.

"శ్రీలేఖ నెత్తిమీదినుంచి యేదో భారం దిగిపోయి నట్టయింది.

"శ్రీలేఖా! నీవు యిట్లా దిగులుపడుతూ వుంటే లాభంలేదు. ధైర్యం చిక్కబట్టుకుని అతణ్ణి మళ్ళీ నీవాణ్ణి చేసుకోడానికి ప్రయత్నించు" అంది.

"అతడు నాకుకనబడి చాలారోజులైంది. మా అక్కను తలచుకుని పిచ్చియెత్తి, యెక్కడికి వెళ్ళాడో తెలియదు."

"ఎక్కడికీ వెళ్ళివుండడు. మీ అక్కకోసమే ఆమె యింటిచుట్టూ తిరుగుతూవుంటాడు. అక్కడికివెళ్ళి చూడు."

శ్రీలేఖ యేమీ మాట్లాడలేదు. ఆమెమనస్సులో యేవేవో ఆలోచనలు అర్థంలేకుండా పిచ్చిపిచ్చిగా పరుగు లెత్తినై. నళినాక్షుని మళ్ళీ తనవాణ్ణి చేసుకోవాలి అన్న వొకనిశ్చయానికి వచ్చింది ఆమె. కాని యెట్లా?

# 23

శ్రీలేఖ హిమగిరిలోయలోకి వరూధినియింటికి వచ్చింది. వరూధినిభవనం యిప్పుడు చాలా మారిపోయివుంది. మునుపటి కన్న యెన్నోరెట్లు యిప్పుడు బాగా అలంకరింపబడివుంది. అంత చిత్రమైన మకరతోరణాలను తాను యిదివరకు యెన్నడూ చూడలేదు. ప్రతిరోజూ గొప్పగా యేదో వుత్సవం అక్కడ జరుగుతూవుండి వుండాలని ఆమె గ్రహించింది. ఆ వుత్సవానికి వరూధిని తన్ను యెందుకు ఆహ్వానించలేదు ? యేమో ! ఆమె హృదయం పరిపరివిధాల పరుగెడుతోంది. అక్కకోసం ఆ గృహమంతా వెదకింది. యెక్కడా వరూధిని కనుపించలేదు. పేరుపెట్టి గట్టిగా పిలిచింది. ప్రతిధ్వనికూడా రాలేదు. ఆమె విసిగిపోయింది. వరూధిని యెక్కడికి వెళ్ళి నట్టు ? శిల్పి జ్ఞాపకంవచ్చాడు. గుహలోకి వెళ్ళిందేమో ?

గుహాభిముఖంగా నడచివెడుతోంది శ్రీలేఖ. దూరా న్నుంచి సన్ననిపాట వినిపించింది. పరిచితమైన కంఠస్వరమే ! తన అక్క వరూధినిదే ! యెక్కడుంది ? నాలుగుదిక్కులూ కలయజూచింది.

ప్రశాంతంగా ప్రవహిస్తున్న గంగ నీటిమీాద పూదోనెలో కూర్చుని తెడ్లువేసుకుంటూ వస్తున్నారు వొక స్త్రీ వొక పురుషుడూ. ఆ స్త్రీని తాను దూరాన్నుంచికూడా గుర్తుపట్టగలిగింది. ఆమె తనఅక్క వరూధినే! మరి ఆ పక్కన

కూర్చున్న దెవరు? నళినాక్షుడా? రెప్పలల్లార్చి చూస్తోంది. ఆమెగుండె దడదడ కొట్టుకుంటోంది. నళినాక్షుడు పిచ్చియెత్తి యెక్కడికో వెళ్ళాడనుకుని తాను పొరబడింది. తన అక్క పవిత్రతను తాను నమ్మింది! యెంత ఘోరం యెంత మోసం!

అతడు నళినాక్షుడేనా! యెంతగా మారిపోయాడు! కన్నులు నులుముకుని మళ్ళీ చూసింది. పూల నావ మెల్లి మెల్లిగా దగ్గరకు వస్తోంది. వరూధిని పాట స్ఫుటంగా, పెద్దగా వినబడుతోంది.

అతడు నళినాక్షుడు కాడు. తాను పొరపాటుపడింది. ఇత డెవరో బాహ్మణ యువకునిలా వున్నాడు. నళినాక్షుని కన్నా వెయ్యిరెట్లు అందమైనవాడు. తనఅక్క అతనితో విహరిస్తోంది. సశరీరంతో స్వర్గసుఖాన్ని అనుభవిస్తున్నాడు మానవుడు. పుణ్యం జేసుకున్నాడు. తనఅక్కకు జోడైనవాడు.

మరి నళినాక్షుడు యెక్కడ? తానుకోరిన వరూధిని మరొకనితో వుండడం చూసి, నళినాక్షునికి నిజంగానే పిచ్చి యెత్తి వుండాలి. యే అడవిలోకో వెళ్ళిపోయి వుండాలి! నళినాక్షుడు యింక తనకు కనబడడా? ఇంతవరకూ అణగ దొక్కుకుంటూవున్న దుఃఖం పొంగి పొరలి గట్లుతెంచుకుని వచ్చేసింది శ్రీలేఖకు.

నావ గట్టుచేరింది. వరూధినీ ప్రవరుడు పడవదిగి గట్టుమీదకు యెక్కారు.

“అక్కా!” అంది శ్రీలేఖ.

"చెల్లీ! యెట్లా మారిపోయావే— నాతల్లీ!" అంది. ఆమెను కౌగలించుకుంటూ వరూధిని.

"ఈమె యెవరు?" అన్నాడు ప్రవరుడు.

"మా చెల్లెలు శ్రీలేఖ. ఈమె భర్త దగ్గరే నేను చిత్రలేఖనం నేర్చుకుంది.

"ఆలాగా! ఈమె యింత విచారంగా వుందేం? మీలో దైవత్వానికన్న మానవత్వమే యెక్కువగా గోచరిస్తోందే!" అన్నాడు.

"భ్రమరకీటకన్యాయం— మానవుల సాహచర్యం." అంది నవ్వుతూ వరూధిని.

"శ్రీలేఖ యేమీ మాట్లాడలేదు.

"ఇతడు మీ బావ. పేరు ప్రవరుడు." అంది శ్రీలేఖతో వరూధిని.

శ్రీలేఖ చేతులు జోడించి అతనికి నమస్కరించింది. ప్రవరుడు చిరునవ్వు నవ్వాడు.

"అక్కా!" అంది రుద్ధమైన కంఠంతో శ్రీలేఖ. "ఆయన యింటిదగ్గర లేడు" అంది బావురుమంటూ.

ప్రవరుడు దూరంగా వెళ్ళి లేడిపిల్లకు గడ్డితినిపిస్తూ వున్నాడు.

"ఎక్కడికి వెళ్ళాడో?" అంది వరూధిని.

"యేమో! చాలారోజులైంది వెళ్ళి."

"మీరిద్దరూ నాయింటికి రావడం మానుకున్నారు. అతనికి నామీద కోపంవచ్చి, నిన్నుకూడా పంపడం మానుకున్నాడనుకున్నాను" అంది.

'అతనికి నీమీదకోపమా!' అంది శ్రీలేఖ ఆశ్చర్యంతో

వరూధిని నాలుకకొరుక్కుంది ఆమాట అన్నందుకు. "ఏమీలేదు యింట్లోకి వెళ్ళు, నే నిప్పుడే వస్తాను." అంది ప్రవరునికోసం చుట్టూ చూస్తూ. ప్రవరుడు పావురాళ్ళతో ఆడుకుంటున్నాడు.

"తాత వచ్చాడా?" అంది శ్రీలేఖ.

"ఆఁ..."

శ్రీలేఖ వరూధినీ ప్రవరుల యేకాంతానికి భంగంకలిగించకూడదని బయలుదేరింది. శిల్పిని చూద్దామనుకున్నది.

"యింటికి వెళ్ళిపోయేవు. పదిరోజులపాటు యిక్కడే వుండి వెళ్ళవచ్చులే, అసలే దిగులుపడివున్నావు." అని అరిచింది వరూధిని. శ్రీలేఖ నడిచి వెడుతూనేవుంది.

శ్రీలేఖ గుహకు వచ్చింది. తాత యిటూ అటూ పచార్లుచేస్తున్నాడు.

"నా తల్లిని చూడకుండా ఒక్కక్షణం వుండలేను. కాని ఆమె ఆనందానికి భంగంకలిగిస్తానా? తనలోతాను గొణుక్కుంటున్నాడు. "తాతా!" అంది శ్రీలేఖ. శిల్పి వెనుదిరిగి చూసాడు. శ్రీలేఖను చూసి విస్తుపోయాడు.

"ఎంత చిక్కిపోయావు తల్లీ! ఆ చిలిపిచూపులూ, ఆ కిలకిలనవ్వులూ అన్నీ యెక్కడికిపోయినై?" అన్నాడు.

"ఆయన నన్నువిడచి యెక్కడికో వెళ్ళిపోయారు—" అంది శ్రీలేఖ.

తాత నివ్వెరపోయి చూశాడు. ఇటూ అటూ పచార్లుచేస్తున్నాడు. "ఎంతకాలమైంది?" అని అడిగాడు.

"చాలారోజులైంది. నెలలు గడిచినై" అంది శ్రీలేఖ.

"నళినాక్షుడు యింటిదగ్గర లేడు. పైనబడితే ధిక్కరించి వెళ్ళిన పవిత్రహృదయుడు మళ్ళీ వచ్చాడు — నేను వారియెదుటకు వెళ్ళకూడదు—" తాత తనలో తాను గొణుక్కుంటున్నాడు.

"శ్రీలేఖా!— మీబావను చూశావా?" అన్నాడు.

"చూశాను."

"నువ్వు కొద్దిరోజులపాటు యిక్కడేవుండు శ్రీలేఖా!" మీ యీ కొత్తబావను కనిపెడుతూవుండు" అన్నాడు.

శ్రీలేఖకు అతని మాటలు అర్థంకాలేదు.

"ఉంటావా శ్రీలేఖా?"

"ఉంటాను తాతా"

"వెళ్ళు — మీ అక్కయింటికి వెళ్ళు — ప్రతిరోజూ నాకు కనబడుతూవుండు."

"నువ్వుకూడా రావా?" అంది.

"నేనక్కడికి రాకూడదని మీ అక్క బ్రతిమాలుకుంది. మీబావ ఆజ్ఞ అది. ఆమే అప్పుడప్పుడూ ఇక్కడికి వస్తూంటుంది— అతడు రాడు."

శ్రీ లే ఖ వెళ్ళిపోయింది. తాత యిటూ అటూ పచార్లు చేస్తూనే వున్నాడు. "వరూధిని జీవితం చిత్రి

మైంది. కర్మ పరిపాకం సరిగ్గావుండి యేజన్మలో నైనా కవిగాపుడితే, పవిత్రమైన తుంగభద్రా నదీతీరంలో కూర్చుని తియ్యని తెలుగుభాషలో ఆమె జీవితాన్ని వర్ణిస్తూ కాలం గడపాలనిపిస్తూవుంది" అని తనలో తాను అనుకున్నాడు. "నాతల్లి తెలియకుండా మోసపోతోంది" అని పెద్దగా నిట్టూర్పువిడిచాడు.

## 24

ఆనందసాగరంమీద వింతగా నాట్యమాడే అలలమీంది నురుగాఅన్నట్టు చిట్టుములు ఎడతెగకుండా వస్తున్నై వరూధినికి. ఆమె గర్భవతిఅయింది. చెక్కిళ్ళు తెల్లబారినై. సన్నగా వున్నదో లేదో అని సందేహం కలిగించే ఆమెనడుము క్రమంగా బలిసి వళిసీమ నాక్రమించింది. పేదవాడి కష్టం దోచుకొనిబలిసిపక్కవాళ్ళబ్రతుకుపాడుచేసినట్టు. ఆమెమునుపు పాడినట్టు సంగీతం పాడలేదు. ఇదివరకు ఆడినట్టు నాట్యమాడలేదు. పథికులను జయించి, టంకారధ్వనులూ, చలనము చాలింపబడి మూలకుచేర్చబడ్డ మన్మథచాపంలా వుంది యిప్పుడు ఆమెస్థితి.

ప్రవరుణ్ణివిడిచి ఆమె వొక్కక్షణం వుండలేదు. తను పోగొట్టుకున్నాననుకున్న వస్తువు మళ్ళీ తనకు లభించింది. దాన్ని పదిలంగా కాపాడుకోవాలి. అతడు నిద్రపోతున్నప్పుడు అతణ్ణే చూస్తూ కూర్చోవాలనిపిస్తుందామెకు. కాని, అతడు

నిద్రపోడు. తనదగ్గరకు వచ్చినప్పటినుండి అతడు ఒక్కనాడు కూడా నిద్రపోలేదు. అతడు మానవుడే! కాని, అతనిలో మానవత్వం యేకోశానా కన్పించదు. యే మునిదో శాపం చేత భూరుసుడై పుట్టివుండాలి!

ఆ నాడు పొద్దుటినుండీ వరూథిని ప్రవరునికోసం వెదుకుతోంది. తోటంతా వెదకింది. ఎక్కడా కనుపించలేదు. ఇంక వెదుకలేక యింటికి వచ్చింది. ఇల్లు జ్ఞాపకంవచ్చి వెళ్ళిపోయాడేమోనని ఆమెకు భయంపట్టుకుంది. అతనికి యింటికి దారి తెలియదన్నసంగతి ఆమెకు కొంచెం ధైర్యాన్ని కలిగించింది.

దూరంగా మామిడిచెట్టునానుకొని యెవరో నిలబడ్డట్టు ఆమెకు కనబడింది. అంగవస్త్రం గాలికి కొట్టుకొంటూ ఆమెను ఆహ్వానిస్తున్నట్టు కనబడింది. గర్భభారాన్ని మోయలేక ఆయాసంతో నడచివెళ్ళింది. అందెలు చప్పుడుకాకుండా అడుగుమీద అడుగువేసుకుంటూ వెళ్ళింది. "అమ్మదొంగా! యిక్కడున్నారా!" అంటూ అంగవస్త్రం పట్టుకుని లాగింది.

ఆశ్చర్యం అతడు ప్రవరుడు గాడు! నళినాక్షుడు! దీనంగా జాలిపుట్టించే చూపులతో, శుష్కించిపోయిన ముఖంతో నిలబడివున్నాడు. వరూథిని అతనిఅంగవస్త్రాన్ని విడిచి, అట్లాగే నిలబడిపోయింది. "న—ళి—నా—క్షా! నీ——వా!" అన్నమాటలు అప్రయత్నంగా ఆమెనోటినుండి వెలువడినై.

"వరూధినీ!— అన్నాడు" నళినాక్షుడు.

"ఎక్కడికి వెళ్ళావోయీ యిన్నిరోజులు? నీ కోసం శ్రీలేఖ యెంతపరితపిస్తోంది. దాన్ని చూస్తూంటే నా కడుపు తరుక్కుపోతోంది" అంది.

"నేను నీ కోసం యెంతగా పరితపిస్తున్నానో నీకు తెలుసా వరూధినీ? నన్ను దయచూడలేవా?"

"నళినాక్షా! నిన్నుచూస్తే నాకు జాలికలుగుతోంది. నన్ను, నా హృదయాన్ని నీవు అర్థంచేసుకోలేకపోతున్నావు— గురువుగా తప్ప నా హృదయంలో మరేస్థానమూ నీకు లభించదు." అంది వరూధిని.

"వరూధినీ! దేవకాంతగాపుట్టి, నీ యౌవనాన్నంతా వొక మర్త్యుని అనుభవింపజేస్తున్నావు—" అన్నాడు.

"నళినాక్షా!—" అంది గట్టిగా. ప్రవరుడెక్కడ వచ్చేస్తాడోనని చుట్టూ చూసింది. "అతణ్ణి వొక్కమాటంటే నేను సహించలేను" అంది కోపంతో. నళినాక్షు డేమీ మాట్లాడలేదు. త్రాచుపాములా లోపలికి వెళ్ళిపోయింది వరూధిని. అక్కడ వొక్కక్షణం నిలవడానికి ఆమెకు మనస్కరించలేదు. నళినాక్షునికి నవ్వువచ్చింది. పెద్దగా నవ్వాడు. వికటంగా నవ్వాడు. చూస్తూ చూస్తూవుండగానే ప్రవరుడుగా మారిపోయాడు. మళ్లీ నవ్వాడు. "ఎంత అమాయకురాలు" అన్నాడు నవ్వుతూనే.

ఎవరిదో పాడిదగ్గు వినిపించింది. అతనిగుండెలు ఆగిపోయినంతపని అయింది. చుట్టూ చూశాడు. యెవ్వరూ కనుపిం

చలేదు. తాను రూపం మారుతుండగా యెవరైనా చూశారా? వరూధినే చూసిందా? కాదు కాదు; వరూధిని లోపలికి వెళ్ళి పోయింది. వరూధినిని పరీక్షించడానికి వచ్చి, తనే పరీక్షలో పడ్డాడు. అక్కడ నిలచివుండడం మంచిదికాదు. తొందర తొందరగా లోపలికి నడచివెళ్ళాడు.

వరూధిని యేడుస్తూ కూర్చుంది. ప్రవరుణ్ణిచూసి వొక్కసారి అతనికౌగిట్లోకి వాలి వెక్కి వెక్కి యేడ్చింది. "ఇంతసేపు నన్నువిడిచి యెక్కడికి వెళ్ళారు? నేను బ్రతికి వుండడం మీకు యిష్టంలేదా?" అంది వీణాధ్వనిలాంటి కంఠంతో.

అత డేమీ మాట్లాడలేదు. అతని మనస్సు మనస్సులో లేదు. ఎవరైనా తన్ను చూశారేమో అన్న భయం అతణ్ణి కలతపెడుతోంది.

అతడు మాట్లాడకపోవడంచూసి వరూధిని భయపడింది తాను నళినాక్షునితో మాట్లాడుతుండగా ప్రవరుడు చూసి, తనను సందేహించాడేమోనని ఆమె హృదయం కొట్టుకుంది. తా నతనికి దూరమైపోతానేమో అని శంకించింది. తన పవిత్రతను యెలా వెల్లడించడమా అని ఆమె ఆలోచిస్తూ నిలబడింది.

"ఇవ్వాళ యెలాగో వున్నారు. వొంట్లో బాగాలేదా?" అని ప్రశ్నించింది.

అతడు తనలోని కలవరపాటును కప్పిపుచ్చడానికి ప్రయత్నించాడు కాని, గుండెలో దడమాత్రం పోలేదు. ఎవరిదో దగ్గు వినిపించింది. ఎవరిదై వుంటుంది? తన్ను యెవరో నిశ్చయంగా కనిపెట్టారు.

అత డేమీ మాట్లాడలేదు.

"మీ మనస్సు యివ్వాళ తిన్నగా లేనట్టుంది." అంది మళ్ళీ వరూధిని.

"అవును వరూ! ఇవ్వాళ నా కెట్లాగో వుంది. నన్ను కాస్సేపు యేకాంతంగా వుండనివ్వు" అన్నాడు.

వరూధిని బాధపడింది అతని మనస్సుకు యేమికష్టం కలిగిందోనని.

"వీణ మేళవించనా?" అంది.

"వొద్దు వరూధినీ! నన్ను కొంతసేపు నిశ్శబ్దమైన స్థలంలో వుండనివ్వు"

వరూధిని ఇంకేమీ అనలేకపోయింది. కన్నీళ్ళు కారుస్తూ నిలబడిపోయింది. "శాస్త్రీ—!" అని పిలుస్తూ తుఫానులా లోపలికి తోసుకొచ్చింది శ్రీలేఖ. ఆమెవాలకం వరూధిని కేమీ అర్థంకాలేదు. ఆమెను యెగాదిగా చూసింది. శ్రీలేఖ వేగంగా నిట్టూర్పులు విడుస్తూ ప్రవరుణ్ణి చూస్తోంది.

"శాస్త్రీ – అదేంపేరు? బావా అని పిలవలేవూ? అంది వరూధిని.

"సకలశాస్త్రపారంగతుడు, అతణ్ణి శాస్త్రీ అని పిలిస్తే తప్పేమీలేదు." అంది శ్రీలేఖ. శ్రీలేఖ కేదో మతి

భ్రమించిందనుకుంది వరూధిని. ప్రవరుడు ఏదో ఆలోచిస్తూ నిలబడ్డాడు.

" నీకు పిచ్చియెత్తలేదుగదా ? " అంది వరూధిని.

లేదు, నా కొక సందేహంకలిగింది— దాన్ని యీ శాస్త్రిగారే తీర్చాలి— " అంది శ్రీలేఖ.

అతడు నీతో యిప్పుడు మాట్లాడలేడు. అతని మనస్సు తిన్నగాలేదు—— " అంది వరూధిని.

" తిన్నగాలేని సంగతి నాకు తెలుసు—" అని యేమో అనబోయింది. " నీ సందేహమేమిటి శ్రీలేఖా ? " అన్నా డతడు ఆమెమాటలకు అడ్డువస్తూ. వరూధిని వారిద్దరినీ చూస్తూ నిలబడిపోయింది.

" మీరు శాస్త్రాలన్నీ చదువుకున్నవారు—— యేది పాపమో యేది పుణ్యమో మీకు తెలుసు——"

అతనిహృదయాన్ని యెవరో యీటెతో పొడుస్తున్నట్టు బాధపడుతున్నా డతడు.

" ఒక పురుషుడు ఒకస్త్రీని ప్రేమిస్తాడు, కాదు, కామిస్తాడు. ఆమె అతణ్ణి వరించదు— ఆమె మరొకరిని కోరుతుంది. అతడు ఆమెకు దక్కడు— అప్పుడు— అప్పుడు— " శ్రీలేఖ అక్కవైపు చూసింది. దుఃఖం గట్లు తెంచుకుని వచ్చేసింది. ముఖాన్ని రెండు చేతులతో కప్పేసుకుంది. " అప్పుడు— అప్పుడు—" ఇక ఆమె అక్కడ నిలబడలేకపోయింది. వచ్చి నట్టుగానే బిరబిర నడిచి వెళ్ళిపోయింది.

"దీనికి పిచ్చియెత్తింది—" అంది వరూధిని.

ప్రవరుడు యేమీ మాట్లాడలేదు. "నన్ను యేకాంతంగా వుండనివ్వు వరూధినీ—" అని వొకగదిలోకి వెళ్ళిపోయాడు.

వరూధిని యేమీ అర్థంకాక, గర్భాయాసంతో ఆసనంమీద కూలబడిపోయింది. నళినాక్షుడు తనకు కనబడిన సంగతి శ్రీలేఖతో చెప్పానుకానే అని నాలుకకొరుక్కుంది.

# 25

నళినాక్షుడు రూపం మారుతుండగా శ్రీలేఖ పొదరింటి చాటునుండి చూసింది. యెవరో కనిపెట్టారన్నసంగతి అతనికి తెలియాలనే ఆమె మెల్లిగా దగ్గింది. తనఅక్కకు జరుగుతున్న ద్రోహం ఆమె సహించలేకపోయింది. నిలవదీసి తనఅక్కముందరే అతణ్ణి కనుక్కోవాలని ఆత్రంతో వెళ్ళింది. యెన్నెన్నో ప్రశ్నలువేసి అతనికి గుక్కతిరగనివ్వకుండాచేసి, అతని దొంగతనం అతనిచేతనే చెప్పించాలని వెళ్ళింది—కాని ఆమెకు యేడ్పుతప్ప మరేదీ రాలేదు.

అతనిముందు నిలవడానికి కూడా ఆమె సహించలేకపోయింది. వంచిత అయిన వరూధినిముఖం చూసి, ఆమెకు మరింత దుఃఖం వచ్చేసింది. ముఖాన్ని రెండు చేతులతో కప్పుకుని బయటికి వచ్చేసింది.

"మీ యీ కొత్త బావను కనిపెడుతూవుండు—" అని ముసలి శిల్పి హెచ్చరించిన నాటినుండి ఆమె జాగ్రత్తగా ప్రవరుణ్ణి కనిపెడుతూనేవుంది. ఒకసంగతిమాత్రం ఆమె బాగా గుర్తించింది. తనతో అతడు యెక్కువ మాట్లాడడు. తన యెదురుగా అతడు యెక్కువసేపు వుండడు. తనతో మాట్లాడు తున్నంతసేపూ యేదోపనిలో లీనమైవున్నట్టు నటిస్తున్నాడు.

మరొక్కసంగతి తనను పరీక్షచేయమన్నాడు శిల్పి. అతడు నిద్రపోయి నప్పుడు చూడమన్నాడు. ఆమె చాలా సార్లు అందుకోసం ప్రయత్నించింది. కాని అతడు యెప్పుడూ నిద్రపోయినట్టు ఆమె చూడలేదు. బహుశా అతనికి నిద్ర పట్టదేమో! మానవుడు కాడా?

వరూధినీ ప్రవరుల సంగమకాలంలో యెక్కడైనా పొంచివుండి చూడగలిగితే చూడమని తాత చెప్పాడు. అది యెట్లా సాధ్యపడుతుంది?

నళినాక్షుడు ఆరూపంలో వున్నాడని తాత తనకు చెప్పి, అతణ్ణి జాగ్రత్తగా పరీక్షచేస్తూ వుండమని చెప్పాడు. మొదట తాను నమ్మలేదు. నళినాక్షునికి పిచ్చియెత్తి యెక్క డికో లేచిపోయాడనుకుంది. ఇప్పుడు నిజం తెలిసిపోయింది!

వరూధిని మోసపోతోంది. తనుకోరిన ప్రవరుడే తనకు లభించాడనుకుని మోసపోతోంది.

అబ్బ! నళినాక్షుడు యెంతద్రోహి! యెంతటి కపట వేషధారి! తనకు కావాలనుకున్న ఆడుదాన్ని మాయచేసి అయినా అనుభవిస్తాడు.

శ్రీలేఖకు కలిగిన దుఃఖం; రోషం యింకా తగ్గలేదు. తిన్నగా గుహలోకి వచ్చింది. తాతను కౌగలించుకుని బిగ్గరగా యేడవాలనిపించిం దామెకు.

తాత యిటూ అటూ పచార్లు చేస్తున్నాడు గుహలో. తనలోతాను గొణుక్కుంటున్నాడు.

"తాతా!" అంది పొంగివస్తూన్న దుఃఖంతో రుద్ధమైన కంఠంతో శ్రీలేఖ. శిల్పి చేతులు కట్టుకుని ఆమెవంక చూసాడు.

"నీవు చెప్పిందంతా నిజం తాతా! అతడే! నళినాక్షుడే! ఆరూపంలోవున్నాడు. ఇవ్వాళచూడగలిగాను–" అతని రొమ్ముకు తన తలనాన్చి వెక్కి–వెక్కి యేడుస్తూ అంది.

తాత పెద్దగా నిట్టూర్పు విడిచాడు.

"నాకు తెలుసు– యిన్నిరోజులనుండీ యేదో మోసం జరుగుతున్నదని. పైనబడినా తోసేసి వెళ్ళిపోయినవాడు తిరిగి వస్తాడా? ఆనాడే నళినాక్షునిమీాద నాకు అనుమానం కలిగింది. ఇప్పుడేమనుకుంటే యేంలాభం? గ త జ ల సే తు బం ధ నం! నా తల్లి– నిర్మలంగా కళకోసమే కళారాధకులకోసమే తన జీవతాన్ని గడుపుతానని పలికిన నా తల్లి– పాడైపోయింది. అతని కామాగ్నిలో దగ్ధురాలైపోయింది. అత డామెసౌంద ర్యాన్ని పీల్చి పిప్పిచేశాడు!" అన్నాడు తాత కళ్ళల్లో నీళ్ళుకూడా తిరిగినై. శ్రీలేఖ వెక్కుతూనేవుంది.

"ఈసంగతి మీాఅక్కతో చెప్పావా తల్లీ?" అన్నాడు.

"లేదు తాతా! పట్టివ్వాలనుకున్నాను. అంతపని చేయలేకపోయాను." అంది శ్రీలేఖ.

"చెప్పవద్దు తల్లీ! వరూధినికి ఈ సంగతి తెలిస్తే ఆమెగుండె పగిలిపోతుంది. ఆమెకు ఈ సంగతి యెన్నడూ చెప్పవద్దమ్మా!" అన్నాడు.

"మరి నాకు నళినాక్షుడు— నేను అతడు లేకుండా యెట్లా జీవించను తాతా?" అంది కన్నీళ్ళు కారుస్తూ.

"అతడు నీకు లభించేటట్లు చేస్తాను తల్లీ. నీకు వొక వుపాయం ఆలోచించి చెబుతాను— నన్ను కొంచెంసేపు యేకాంతంగా వుండనివ్వు" అన్నాడు.

శ్రీలేఖ అక్కణ్ణుంచి వెళ్ళిపోయింది. ఆమె వెడుతుండగా "మళ్ళీ నాకు సాయంకాలం కనబడు శ్రీలేఖా!" అన్నాడు.

తాత పచార్లుచేస్తూ నా తల్లి మోసపోయింది. పూర్తిగా మోసపోయింది. ఆమెను చూస్తే నా గుండె తరుక్కు పోతోంది. పవిత్రంగా వుండాలనుకున్న పిల్ల యెట్లా పాడైపోయింది! అంతా దైవమాయ.

తాను చెక్కిన వరూధిని శిలావిగ్రహాలను చూచి పెద్దగా వొక నిట్టూర్పు విడిచాడు.

## 26

నళినాక్షుడు తాను పట్టుబడిపోయాననుకున్నాడు. తను రూపం మారుతుండగా శ్రీలేఖ తప్పకుండా చూసివుండాలి. తనకు వినిపించిన పాడిదగ్గు ఆమెదే! నిజ స్వరూపంతో వరూధిని హృదయాన్ని వొకసారి పరీక్ష చేయాలనుకున్నాడు. యెందుకో ఆవాళ అతనికి ఆ బుద్ధిపుట్టింది.

ఇన్నిరోజులూ శ్రీలేఖ తనను వెన్నంటే తిరుగుతోంది. తను ఆ రూపంలో తిరుగుతున్నట్లు ఆమెకు ఏవిధంగా తెలిసింది? ఆమె సమీపంలో వుండకుండా యెన్నిసార్లు తప్పించుకోడానికి ప్రయత్నించినా ఆమె తనదగ్గరకు రాకుండా చేసుకోలేకపోయాడు.

తను ఆ రూపంలో వుండికూడా శ్రీలేఖ స్థితిని చూస్తే అతనికి జాలికలిగేది. తనకోసం యెంత పరితపిస్తోంది! తను యింట్లో లేకపోవడంవల్లా, తను వున్మాద స్థితిలోవుండి, వరూధినికోసం పలవరించడంవల్లా ఆమె అనుమానానికి తాను గురిఅయివుండాలి! లేకపోతే ఆమె యిట్లా తనను వెన్నంటి తిరగడం జరగదు.

ఇప్పుడు నళినాక్షుని స్థితి ఆకాశంవరకూ తీసుకుపోయి ఆధారంలేకుండా తోసినట్టుంది. గుండెల్లోని కలవరపాటు ముఖంలో ప్రతిఫలిస్తూవుంటే వరూధిని యెక్కడ కనిపెట్టి వేస్తోందో అని ఆమెదగ్గర వొక్కక్షణం నిలబడలేకపోయాడు. ఆమె యింట్లో వుండడానికే అతనికి భయంకలిగింది.

ఇంటికివచ్చి యిటూ అటూ పచార్లుచేస్తున్నాడు. తనుచేస్తున్న మోసం ఎప్పుడో వొకనాడు వరూధినికి తెలిసి పోతుంది! అతనిగుండె— యెత్తుగా గట్టిగావున్న అతనిగుండె దడదడలాడింది.

అబ్బ! మన్మథుడు తనచేత యెంతపని చేయించాడు!

అతడు యిటూ అటూ పచార్లు చేస్తున్నాడు.

"మీరు యింతద్రోహం చేస్తారనుకోలేదు"

నళినాక్షుడు వెనుదిరిగి చూచాడు ద్వారందగ్గర శ్రీలేఖ నిలబడివుంది. ఆమెముఖం చూస్తే అతనికి భయంపుట్టింది. శ్రీలేఖ విడిచే వేడినిట్టూర్పులకు ఆమె వక్షోజాలు వేగంగా కదులుతున్నై.

"శ్రీ – లే – ఖా!" అని పొడిఅక్షరాలు మాత్రం పలకగలిగాడు అతడు.

"దొంగవేషం యెంతకాలం దాగుతుందనుకున్నారు ఆమాత్రం పాపభీతి మీలోలేదా?" అంది శ్రీలేఖ అతనికి యెదురుగుండా వచ్చి.

నళినాక్షుడు తను యేమీ యెరుగనట్టు నటించాలని చూచాడు. ఒక అబద్ధాన్ని కప్పడానికి పదిఅబద్ధాలు చెప్పాలి.

"ఏమిటి శ్రీలేఖా, ఇవ్వాళ యేదో వింతగా మాట్లాడు తున్నావు?" అన్నాడు.

"మీరుచేసిన వింతకన్నా నామాటలు వింతగా వున్నాయా?"

"నీ మాటలు నా కర్థంకావడంలేదు శ్రీ-"అన్నాడు ఆమె చేతులను పట్టుకుంటూ. తొలిరోజుల్లో తా నామెతో ప్రవర్తించినట్టే ప్రవర్తించాలని చూశాడు. శ్రీలేఖ కోపంతో చేతులను విదిలించింది. "ఎందుకర్థమవుతుంది? చేసిన మోసం యెత్తి చూపిస్తే, యేమీ యెరగనట్టు నటించడం మీకు చేతకానిపనిగాదుగా" అంది.

"శ్రీలేఖా—"

"శ్రీలేఖ! ఇంక శ్రీలేఖతో మీ కేం పని? మీకోసం పరితపించడమే నా పని. అందుకు తగిన శాస్తి జరిగింది.— పాపం! వరూధిని—" శ్రీలేఖకు దుఃఖం ముంచుకొచ్చింది.

"వరూధిని కేమైంది?" అన్నాడు ఆశ్చర్యాన్ని వెలిబుచ్చుతూ.

శ్రీలేఖకు వొళ్ళుమండింది. "ఏమైంది? ఏమైనా అవుతుంది. మీరు మారువేషంతో ఆమెను అనుభవించడం నేను కనిపెట్టలేదనుకున్నారా? ఛీ! మీ ముఖం చూస్తే నే—" శ్రీలేఖ అంతకంటే అనలేకపోయింది. అతనిముందు నిలబడ లేకపోయింది. పొంగివచ్చిన దుఃఖాన్ని అణచుకోలేక తుఫానులా తోసుకుంటూ లోపలికి వెళ్ళిపోయింది.

నళినాక్షుడు పిడుగుదెబ్బతిన్నట్టు అయిపోయాడు. తన రహస్యం బయటపడిపోయింది. వరూధినికి తెలిస్తే! ముసలి శిల్పికి తెలిస్తే!

వికటంగా నవ్వు వినవచ్చింది. ముసలిశిల్పి వచ్చాడా? తపఃశక్తిచేత అగ్నిలా ధుమధుమలాడే అతని కళ్ళముందు

తాను నిలువగలడా? అతని ఆరాధ్యదేవత వరూథినిని తాను మోసంచేసిన సంగతి తెలిస్తే, అతడు సహిస్తాడా? అతనికి తాను యేమి చెప్పాలి? అన్ని పాపాల్లోకీ ఘోరమైన పాపం తాను చేశాడు! మన్మధుని సలహాయిస్తే మూర్ఖంగా తాను యెందుకా పాపకూపంలోకి దిగాలి? తనకు తగినశిక్ష యేమి లభిస్తుందో?. నవ్వువిని నివ్వెరపోయి నళినాక్షుడు వెనకకు తిరిగి చూచాడు. అతడు అనుకున్నట్టు శిల్పికాదు, మన్మథుడు! పుష్పాలంకృతుడై చెరకువిల్లు చేతబట్టుకుని నిలబడ్డాడు.

నళినాక్షు డతన్ని లోపలికి ఆహ్వానించాడు.

"నళినాక్షా!" అన్నాడు మన్మథుడు.

"___ ___ ___"

"నీ హృదయం పరితపిస్తోంది కదూ?" అన్నాడు మళ్లీ.

"అంతా నీ లీల—"

"నా చేతిలో యేమీ లేదు. నేను కాలానికి దాసుణ్ణి. కాలం యేం చెబుతే నే నట్లాచేయాలి — అంతే."

"నీ సలహామీదనే నేను వరూథినిని మోసంచేయవలసి వచ్చింది—" అన్నాడు నళినాక్షుడు.

మన్మథుడు నవ్వాడు.

"నాసలహా యేమిటి, నీవు వరూథినిని మోసంచేయడ మేమిటీ — అంతా కాలం ఆజ్ఞ. దాన్ని మీరి నడవడానికి యెవ్వరికీ గుండెలులేవు."

"నీ మాటల్లో అర్థంలేదు—"

"నా మాటల్లో అర్థం కావలసినంత వుంది. అది చెప్పడానికే నేను స్వయంగా రావలసివచ్చింది."

నళినాక్షుడు యేమీ మాట్లాడలేదు. మన్మథుని ముఖంలోకి చూస్తూ నిలబడిపోయాడు.

"నీ స్వరూపాన్ని వరూథిని యెన్నడూ వరించదు. అందుకు కాలం ఆజ్ఞలేదు. ఆమె మనస్సు ప్రవరుణ్ణితప్ప మరెవర్నీ కోరదు. అదీ కాలం ఆజ్ఞే.

"మరి నాచేత యీ మోసంచేయించడం దేనికి?" అన్నాడు కోపంతో.

"అక్కడేవుంది, కాలంయొక్క చిత్రమైన లీల. వరూథినికి యిప్పుడు పుట్టబోయే పుత్రుడు వొక లోకోత్తర పురుషునికి తండ్రి అవుతాడు."

"కావొచ్చు కాని, యీ ఘోరం నాచేత చేయించడంలో అర్థమేమిటి?"

"వరూథినికి గర్భం నీవల్ల కలగవలసివుంది. కాల మహిమ చిత్రమైంది. వరూథిని జీవితం అంతకన్నా విచిత్రమైంది. ఆమెకు నీవల్ల పొందువుంది కాని, ఆమె నీ స్వరూపాన్ని వరించదు. నీవు ప్రవరుని స్వరూప సహాయంవల్లగాని ఆమెను పొందలేవు. ప్రవరునివల్ల ఆమెకు పొందులేదుకాని, ఆమె ప్రవరుని స్వరూపాన్ని వరించింది—విధి—ఆజ్ఞ అది. ఈ పనికి నేను స్వయంగా కలిపించుకుని చాలాపనులు చేయవలసి వచ్చింది.—"

"మీ పని తీరిపోయింది—"

"నీ కోరికకూడా నాకవిధంగా తీరింపనుకో—"

"నా రహస్యం బయటపడిపోయింది—" అన్నాడు బిక్క-మొహంతో.

'కాలంఆజ్ఞ. ఇంకనీవు నీ నిజస్వరూపాన్ని పొందవచ్చు'

"హఠాత్తుగా ఆమెను విడిచివెళ్ళడం—"

"ఆలోచించుకో—" అని మన్మథుడు వెళ్ళిపోయాడు.

నళినాక్షుడు గొప్ప చిక్కు-లో పడ్డాడు. తను వరూధినిని విడిచి యెట్లా రావడం? చెప్పకుండా వచ్చేస్తే ఆమె గుండెలు పగిలిపోవూ? వరూధినికి తనమోసం శ్రీ లేఖ చెప్పకముందే తాను అక్క-ణ్ణుంచి తప్పించుకు రావాలి—ఇంతలోనే శ్రీలేఖ చెప్పిందేమో! శిల్పికి తెలిసిపోతే అతని మనస్సు పరిపరివిధాల పరుగెడుతోంది.

ఎట్లాగైనా వరూధినిని తాను విడిచిపెట్టక తప్పదు. ఏమిజరిగినా తానుచేసేది యేమీలేదు. ఆమెతో చెప్పివేసి మర్యాదగా బయటపడడమే వుత్తమమైనపని.

బయలుదేరాడు.

"ఎక్క-డికీ మళ్ళీ ప్రయాణం"

నళినాక్షుడు ఆగాడు. శ్రీలేఖ అతణ్ణి వెన్నాడటం మానదేమో! కాలం చిత్రమైన నాటకమాడుతున్నాడు. తాను యిప్పుడు అందరిచేతుల్లో కీలుబొమ్మ అయిపోయాడు. అత డేమీ మాట్లాడలేదు.

మళ్ళీ మారువేషంతో మా అక్క దగ్గరకా ?" అంది మెత్తిపొడుస్తూ.

"శ్రీలేఖా——!" అన్నాడు.

"ఇంకా మీ గుట్టుదాచడానికి యెందుకు ప్రయత్నిస్తారు ? నాకూ, శిల్పికీ అప్పుడే తెలిసిపోయింది. ఇంక మా అక్కకు వొక్కదానికే తెలియవలసివుంది. ఇంకెన్ని రోజులు దాగుతుంది——?"

నళినాక్షునికి కోపంవచ్చింది. కాని అతడు యేమీ చేయలేకపోయాడు. నిర్లక్ష్యంగా మాట్లాడాడు "తెలిస్తే మాత్రం యేంజేస్తుంది—?" అన్నాడు.

శ్రీలేఖకు వొళ్ళు మండింది. ఆమాటలు ఆమె వినలేకపోయింది. శిల్పి ఆమెకుచెప్పిన ఆయుధం జ్ఞాపకంవచ్చింది. దాన్ని కోపంతోనే ప్రయోగించింది.

"యేంజేస్తుందా ? యేంజేస్తుందా ? అమరకాంతకు శాపానుగ్రహాలు కరతలామలకాలు అన్నసంగతి జ్ఞాపకంలేదా? ఒక్క శాపంతో మీరు మళ్ళీ యే జన్మలోనైనా గంధర్వలోకం చూస్తారా !" అంది. ఆమెకన్నులు చింతనిప్పులవలె వున్నవి.

నళినాక్షునికి రౌద్రరూపందాల్చి, శక్తిలా వున్న వరూధిని మనస్సులో కనపడింది. అతనిగుండెలు దడదడ కొట్టుకున్నై. తనకు శాపంతో యేజన్మ, యెంత నీచమైన జన్మ వస్తుందో ! శ్రీలేఖవంక దీనంగా చూశాడు. ఆమె గుప్పెట్లో వుంది తనప్రాణం.

"శ్రీలేఖా—!" అన్నాడు.

"………"

"నన్ను క్షమించు శ్రీలేఖా!" అన్నాడు సున్నితమైన కంఠంతో.

గ్రీష్మతాపానికి తహతహలాడిపోయిన భూమిమీద తొలకరించినట్టయింది శ్రీలేఖకు. ఆమె మౌనంగా వుండి పోయింది.

"మీఅక్కతో యీసంగతి చెబుతావా శ్రీలేఖా—?" అన్నాడు దీనంగా. శ్రీలేఖకు అతనిమీద జాలికలిగింది. ఆమెకు దుఃఖప్రవాహం గట్లు తెంచుకుని వచ్చేసింది. ఒక్క సారిగా వచ్చి అతనికాళ్ళను కౌగలించుకుంది. "చెప్పను, చెప్పలేను. మా అక్క శాపానికి మిమ్మల్ని గురిచెయ్యను. మీరు నాకు కావాలి." అంది వెక్కుతూ.

నళినాక్షుడు ఆమెను లేవనెత్తి తనకౌగిట్లో అదుము కున్నాడు. "నామీద యెంత ప్రేమ నీకు శ్రీలేఖా!" అన్నాడు.

శ్రీలేఖ కంటివెంట ఆనందబాష్పాలు రాలినై. ఆమె వొళ్ళు పులకరించింది. ఆమె మనస్సులోనే శిల్పికి నమస్క రించింది. అతడు చెప్పినవుపాయం నళినాక్షుని మళ్ళీ తనవాణ్ణి చేసింది. పాపం! తనఅక్క వంచిత!

# 27

"పోనివ్వను, పోనివ్వను" వరూధిని ముఖాన్ని రెండు చేతులతో కప్పుకుని పరుపుమీద బోర్లపడి విలపిస్తోంది.

"నా మాట విను వరూధినీ!" ప్రవరుడు దీనంగా ప్రార్థిస్తున్నాడు. వరూధిని లేచికూర్చుని, కన్నీటి తెరల లోంచి అతణ్ణిచూసింది.

"నేను మిమ్మల్ని విడిచి వొక్క-క్షణం వుండలేను—నన్నుకూడా మీవెంట తీసుకు వెళ్ళండి—" అంది.

"వరూధినీ! నా అవస్థను అర్థంచేసుకోకుండా మాట్లాడుతున్నావు. నా యింటిసంగతి తలచుకుంటే నాకు వణుకుపుడుతోంది—"

"ఇన్నిరోజులూ జ్ఞాపకంలేని యిల్లు యిప్పుడు జ్ఞాపకం వచ్చిందా? నామీద మీకు మనస్సు తగ్గిపోతోంది—"

"వరూధినీ!" అన్నాడు ఆమెముఖంలోకి చూస్తూ "నా మాటలమీద నీకు నమ్మకంలేనట్టుంది. ఎవ్వడు యే పాదలేపం నాకాళ్ళకు రాసి, యింతంతపనులు జరగడానికి కారకుడైనాడో అతడు మళ్ళీ తీర్థయాత్రలుచేస్తూ వచ్చి నా కీ వనంలో కనుపించాడు. ఏమని చెప్పను వరూధినీ!" అతని కళ్ళల్లో నీళ్ళు తిరిగినై. కంఠం రుద్ధమైంది. వరూధిని విన్నబోయిన ముఖంతో వింటూ కూర్చుంది.

"పైదక్షత సరిగ్గా లేక పక్వం తప్పి పండబారినపొలం యెండిపోయింది. పశుగణాలన్నీ చూసేవారు లేక అడవిదారి

పట్టి పోయినై. శిష్యులు తమ చదువులన్నీ పూర్వకప్పజెప్పి యిష్టం వచ్చినట్టు తిరుగుతున్నారు. అప్పు తీసుకున్నవాళ్ళు తిరిగి యివ్వక యేడిపించుకు తింటున్నారు. రాచనగరుకు వెళ్ళి, ఆర్జించుకు వచ్చేవాళ్ళు లేక తిండికోసం తిప్పలు పడుతూ, వున్న భూములను కుదువబెట్టి మళ్ళీ వాటిని వదిలించుకోలేక నానాయిబ్బందులూ పడుతున్నారు మా యింట్లో వాళ్ళు. యజమానిలేనియిల్లు యింతకంటే యెట్లావుంటుంది నీవే చెప్పు?"

వరూధిని యేమీ మాట్లాడలేదు.

"నేను వచ్చిననాటినుంచీ నాకోసం పరితపిస్తూ, నా ముసలి తలిదండ్రులు దుఃఖంతో కృశించిపోతూ, నిద్రాహారాలు లేకుండా, మంచానికి అంటుకుపోయి వున్నారట. ఈసంగతంతా చూసివచ్చి, ఆ సిద్ధుడు నాకు చెప్పాడు. ఎంత లెక్కచేయకుండా వుందామన్నా, నా మనస్సు నిలవడంలేదు వరూ!"

వరూధిని పెద్దగా వొక నిట్టూర్పు విడిచింది.

"నీవు ధైర్యచిత్తవు. ఈ కన్నీళ్ళు పెట్టుకోడం నీకు తగునా? అమర కాంతలు కోవిదలు కారా? యోగ వియోగాలు శాశ్వతమైనవా? ప్రియజనులు పోతూ వస్తూ వుండరా? పోయి రాకుండావుండడానికి గళ్ళు తెగిపోయినవా? నే నిప్పుడు వెళ్ళగానే మనస్నేహం విడిపోతుందా వరూ?" అన్నాడు.

ఆమెను తనకౌగిట్లోకి లాక్కున్నాడు. వరూధినికి దుఃఖం పొంగిపొరలి వచ్చింది. అతనివక్షానికి తన తలనుచేర్చి వెక్కి-వెక్కి యేడ్చింది. అతని కంటివెంటకూడా నీళ్ళుకారి, నొక్కులుదేరిన ఆమె తలవెంట్రుకలను తడిపినై.

"నేను వెడుతాను వరూ..." అన్నాడు.

"మన ప్రేమకు చిహ్నమైన పాపాయి పుట్టేవరకైనా వుండండి" అంది రుద్ధమైన కంఠంతో.

నా మనస్సు నిలువనివ్వడంలేదు వరూ. నేను యెట్లాగైనా యిప్పుడు వెళ్ళితీరాలి. ఆ పాదలేప రహస్యాన్ని ఆ సిద్ధుడు నాకు అమూలాగ్రంగా నేర్పాడు. మళ్ళీ వస్తూ పోతూ వుంటానుగా" అన్నాడు కౌగిలి వదిలి ఆమెకన్నీళ్ళను తుడుస్తూ.

"........."

ఇద్దరి అధరాలూ కడసారి కలిసినై. ఒకరి కన్నీటిలో నొకరికన్నీరుకూడా కలిసింది. ఆ అధరబింబాలు ఆఖరిసారిగా వీడినై. అతడు బయటకు వచ్చాడు. వరూధిని అతణ్ణి అనుసరించింది. గర్భాయాసంతో అతని వెనుక నడిచి, అంగణంలో వున్న పోకచెట్టువరకు వచ్చింది. అతడు తిరిగి తిరిగి చూచుకుంటూ వెడుతున్నాడు. పోలేక పోలేక పోతున్నట్లు వెడుతున్నాడు.

పోకబోదియ మాటునుండి వరూధిని చూస్తూనేవుంది. ఆనాడు అతడువస్తూంటే యేవో కోరికలు యీరికలెత్తే

హృదయంతో ఆనందంతో నిండిన హృదయంతో అతని రాకను చూసిన ఆ పోకబోదియ మాటునుంచే చూస్తోంది. ఆమె కోరికలన్నీ నేడు దిగజారిపోయినై. దుఃఖంతో నేడు హృదయం దించుకుపోయింది. ఆమె చూస్తూనేవుంది. అతడు వెడుతూనేవున్నాడు.

చూస్తూవుండగానే అతడు కనుచూపుమేర దాటిపోయాడు. ఆ నిండుచూలాలు వేడిగా నొక దీర్ఘనిశ్వాసం విడిచింది.

"వరూ.........!" శిల్పి కంఠం వినిపించింది. వరూధిని వెనుకకు తిరిగి చూసింది. ఆమెకు దుఃఖం పట్టలేకుండా వచ్చేసింది. అతని రొమ్ముకు తనతలనాన్చి వెక్కి-వెక్కి యేడ్చింది. "తాతా!" అంటూ.

శిల్పి ఆమెతల నిమిరాడు.

"అతడు నన్ను విడిచి వెళ్ళిపోయాడు తాతా!" అంది మళ్ళీ.

"యేడవకు తల్లీ! గర్భిణికి యిట్లా విలపించడం ఆరోగ్యకరంగాదు. లోపలికి వెళ్ళు తల్లీ!" అన్నాడు.

వరూధిని తాత ముఖంలోకి చూసింది.

"అతడు మళ్ళీ వస్తాడా తాతా? అని అడిగింది.

శిల్పి జాలిగా ఆ తన్వివంక చూశాడు.

"నువ్వు లోపలికివెళ్ళి కొంచెం విశ్రాంతి తీసుకో వరూ!" అన్నాడు.

వరూధిని కన్నీళ్ళుతుడుచుకుంటూ బరువుగా అడుగులు వేసుకుంటూ ఇంట్లోకి వెళ్ళింది.

ఋణానుబంధం తెగిపోతే ప్రాణప్రదమైన వలపుకూడా పాసిపోతుందిగదా" అన్నాడు శిల్పి. వరూనికి ఆ మాటలు వినిపించినై. వెనుదిరిగి చూచి నిట్టూరుస్తూ లోపలికివెళ్ళింది.

"నా తల్లి మోసపోయింది, పూర్తిగా మోసపోయింది. కామం, కాలం అంతాకలిసి నా వరూధినిని మోసపుచ్చారు. ఈ సంఘటనతో నా తల్లి జీవితం మరీ చిత్రంగా మారి పోయింది. కర్మ పరిపాకం సరిగ్గావుంటే, యేజన్మలోనైనా కవిగాపుట్టి, పవిత్రమైన తుంగభద్రానదీతీరంలో కూర్చుని తియ్యని తెలుగుభాషలో నాతల్లి విచిత్రమైన జీవితాన్ని వర్ణిస్తాను" అంటూ తనలోతాను గొణుక్కుంటూ వరూధినిని అనుసరించి వెళ్ళాడు ముసలిశిల్పి. ఈ జన్మలో అతడు శిల్పి మాత్రమే.

# 28

నళినాక్షుడు అదోలావున్నాడు. ఎందుకో అతని హృదయంలో యేదో కదిలింది. అతడట్లాగే నిశ్చేష్టుడై చూస్తూవున్నాడు. అతనికి యేమీ తోచక తనగదిలోవున్న వాతాయనంలోనుంచి చూస్తూ నిలబడ్డాడు. ప్రకృతి సౌందర్యాన్నే చూస్తున్నాడో మరి యింకేమి చూస్తున్నాడో! అతనిదృష్టిని వొక గండుతుమ్మెద ఆకర్షించింది.

కలకలలాడుతూ, విరబూచివున్న మాలతీలత మంద మారుతానికి తొలిసారి ప్రియునిస్పర్శకు పులకరించి, జలదరింపుతో వొళ్ళు కదిలించే ముగుదలా కదిలాడుతుంటే, దానిమీద వాలి మకరందపానం చేయబోయిన ఆ తుమ్మెద ఝుంకారం చేస్తూ లేచి నలుదిక్కులా సుగంధాన్ని వెదజల్లుతూన్న కొత్తకీ పుష్పంమీద వాలబోయింది. కాని దాని ప్రయత్నం అతి కష్టంమీదగాని ఫలించిందిగాదు. ఆ పువ్వుమీద కూర్చొని తనివితీరా మకరందాన్ని ఆస్వాదించడానికికూడా దానికి వీలులేకపోయింది. చుట్టూవున్న ముండ్లతో దానిరెక్కలు చీలిపోయేంతపని అయింది. నేర్పుగా అది ఆ అపాయంలోంచి మెల్లాగో బయటపడగలిగింది. తనకోసం యెదురుచూస్తూ వున్నదా అన్నట్టువున్న మాలతిమీదనే మళ్ళీ వాలింది. అదిచూచి నళినాక్షుడు చమత్కృతుడైనాడు. యెందుకో అతని హృదయంలో యేదో కదిలింది.

అదే సమయంలో వొక ఆడుతుమ్మెద సంపంగి చెట్టు మీదకు పరుగు తీస్తోంది. ఆ ఘ్రాణకోసమని బాగా మత్తెక్కిన తుమ్మెద — సంపంగి తనకు విషప్రాయమనే సంగతి తెలుసుకునే స్థితిలో లేదు. కేవలం ఆ పుష్ప సౌందర్యాన్ని చూచే దానిపైకి యెగబడుతోంది. దగ్గరికివెళ్ళి వొక్కసారి తలతిరిగి క్రిందపడింది. పడి కొంతసేపటికిగాని తేరుకోలేక పోయింది. మళ్లీ పైకి లేచింది. సంపంగిమీది భ్రమతోనే సమీపంలోవున్న మరొక పువ్వుమీద వాలింది. నళినాక్షుడు

అలాగే నిశ్చేష్టుడై చూస్తూవున్నాడు. ఇంతలో యెవరివో నునుపైన వేళ్ళు నాజూకుగా ఆ పువ్వుని తుంచినవి. పాపం ఆ తుమ్మెద ఆ పువ్వుకోసం అక్కడే తిరుగుతోంది.

ఆ కోసిన పువ్వుని నాజూకుగా తల్లో తురుముకుంటూ వొయ్యారంగా వొకపడుచు ముందరికి నడిచివస్తూంటే నళినాక్షుడు రెప్పలార్చడం మరచిపోయి చూస్తూ వున్నాడు. ఆమె దాసానిపువ్వు రంగులోవున్న పావడా కట్టింది. పైన వల్లెవాటుగావేసిన బంగారురంగు సన్నని పట్టుబట్టలోంచి ఆకుపచ్చని కంచుకం స్ఫుటంగా కనిపిస్తోంది. యెవ రా పడుచు? ఆ నడకలో యెక్కడి దా వయ్యారం?

ఆమె శ్రీలేఖ. మేడమీదికి వచ్చి అతనిపక్కని నిలబడి వాతాయనంలోంచి తానుగూడా బయటకుచూస్తూనిలబడింది. నళినాక్షుడు ఆమెవంక చూశాడు. ఆమె చిరునవ్వునవ్వింది. ఆమెముఖంలో యిప్పుడు వెనుకటి నిండుదనం వచ్చింది. కళ్ళల్లో ఆ కాంతి వచ్చింది. శ్రీలేఖ మునుపటి శ్రీలేఖ అయింది. నళినాక్షుడు మునుపటివాడు అయ్యాడా?

"నళినాక్షా—!" యెవరిదో స్త్రీకంఠం, యేనాడో విన్నది. నళినాక్షునిగుండె మళ్ళీకలవరపడింది. తిరిగిచూచాడు. చిత్రలేఖ!

"చిత్రా!" అంటూ వెళ్ళి ఆమెను కౌగలించుకుంది శ్రీలేఖ. నళినాక్షుడు అక్కడినుండి తప్పించుకోవాలని చూశాడు. లోపలికి వెళ్ళబోయాడు.

"భయపడకు నళినాక్షా! నేను పాతసంగతులు పైకి తవ్వడానికి రాలేదిప్పుడు. బలవంతంగా నీదగ్గరికి రావలసి వచ్చింది" అంది చిత్రలేఖ.

నళినాక్షుడు యేమీ మాట్లాడకుండా నిలబడ్డాడు. అతని ముఖంలో భయం మాత్రం తాండవమాడుతోంది. శ్రీలేఖ తనపక్కన వుండగా ఆమెరావడం అతనికి యిష్టంలేదు.

"శ్రీలేఖకు మనచరిత్రి తెలుసు" అంది చిత్ర.

అతనికి ఆశ్చర్యం కలిగింది.

"ఇక శ్రీలేఖనైనా స్థిరమైన హృదయంతో ప్రేమించడానికి ప్రయత్నించు. నీకు చెప్పగల యోగ్యత నాకు లేదు. కాని తటస్థపడడంవల్ల చెప్పవలసివచ్చింది. ఇవ్వాళ రతీదేవి దగ్గరకు వెడితే, ఆమె యీవుత్తరం నీకు యిమ్మని యిచ్చింది. తాను స్వయంగా రాలేకపోయానని చెప్పమంది" అని రవిక సందులోంచి వొకవుత్తరాన్ని తీసి అతనికి అందిచ్చింది.

నళినాక్షుడు దాన్ని విప్పి చదివాడు. "నళినాక్షా! నేను నీకు యేవిధంగానూ సహాయపడలేకపోయాను — కాలం — దాని ఆజ్ఞకు యెదురీదడం దుస్సాధ్యమైంది. కాని నీమనోరథం మరొకవిధంగా తీరిందని నా భర్తవల్ల తెలుసుకున్నాను. నీకు తీరికకలిగినప్పుడు మాయింటికి వచ్చి నా భంగిమలను కొన్ని చిత్రించి, నీ నైపుణ్యాన్ని ప్రదర్శించాలని కోరుతున్నా— రతి—"

నళినాక్షునికి నవ్వువచ్చింది. తల పంకిస్తూ వుత్తరాన్ని మరొకసారి చదివాడు.

నేను వెడుతా!" అంది చిత్ర శ్రీలేఖవంక చూసి—వస్తూవస్తూ దారిలో మీ అక్కదగ్గరకు వెళ్ళాను. ఆమెకు మొగపిల్లవాడు పుట్టాడు నిన్న. ఈ వార్త అమరావతిలో చెప్పాలి." అంటూ బయటకు నడిచింది.

"చిత్రా" అంది శ్రీలేఖ. ఆమె ఆగింది.

"నువ్వుకూడా నాతో వుండు." అంది శ్రీలేఖ.

నళినాక్షుడు పెద్దగా నిట్టూర్చాడు.

"లేదు శ్రీ. మీరిద్దరూ సుఖంగావుండండి. అతడు నేర్పిన కళను ఆరాధిస్తూనే నేను యింక కాలం గడుపుతాను—" అంటూ వెళ్ళిపోయింది.

శ్రీలేఖా నళినాక్షులు వొకరిమొహం వొకరు చూస్తూ నిలబడిపోయారు. చిత్ర వెడుతూండడం దూరాన్నుంచి కనిపిస్తూనేవుంది.

"మా అక్కకు కొడుకుపుట్టాడు వెళ్ళి చూద్దాంరండి" అంది శ్రీలేఖ.

"నీవు వెళ్లి రా"

"మీరు రాకూడదా? మీకొడుకేగదా! పాపం! ఆమెకు తెలియదు. ఆమె వంచిత. ఇప్పుడు మీరు నా భర్తగా యీ రూపంలో రావొచ్చులెండి" అంది నవ్వుతూ.

నళినాక్షునికి ఆ మాట శూలంలా తగిలింది.

— సమాప్తం —